ప్రపంచ తెలుగుమహాసభ ప్రచురణ




# ఆధునికాంధ్ర కవిత్వం

## (భావకవిత్వ యుగంవరకు)

రచయిత:

డాక్టర్ సి. నారాయణరెడ్డి









ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్

హైదారాబాద్-500004

# ముందుమాట

ఎన్నో ఏళ్ళుగా అనుకొంటున్న ప్రపంచ తెలుగు మహాసభలు జరుగనున్న పర్వ సమయం ఆసన్నమవుతున్నది. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధులందరిని ఒక చోట సమీకరించవలసిన పెద్దలందరూ కన్నకలలు ఫలిస్తున్న శుభసమయమిది రాబోయే ఉగాది రెండువేల అయిదువందల సంవత్సరాల తెలుగుజాతి చరిత్రలో మరపురాని మధుర ఘట్టము కాగలదు

క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దికి చెందిన శాతవాహనరాజుల కాలంనుండి తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారతదేశంలో తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఐదుకోట్లకుపైగా ఉన్నారు. హిందీ మాట్లాడేవారి తరువాత స్థానం తెలుగువారిదే బౌద్ధ పూర్వయుగంనుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్దఎత్తున ప్రపంచ నలుమూలలకూ వలసవెళ్ళడం జరిగింది. అట్లావెళ్ళిన తెలుగువారు తమ భాషా సంస్కృతీ సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళవించి, వాటిని సంపన్నం చేస్తూ ఉన్నారు

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధానలక్ష్యం తెలుగుప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవడానికీ, తద్వారా వివిధ చైతన్యస్రవంతులను ఏకోన్ముఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేసుకోవడానికి ఈ మహాసభలు దోహదకారులు అవుతవి. అంతేకాక ఈ మహాసభలు అర్థవంతమైన భావ సమైక్యతకు ప్రాతిపదికలై తెలుగుజాతిని సమైక్యం చేయగలవనీ, ఆ విధంగా జాతీయ అభ్యుదయానికి తోడ్పడగలవనీ విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదీన తెలుగు ఉగాది రోజున ప్రారంభమై ఒక వారం రోజులపాటు జరిగే ఈ మహా సభలలో వివిధ దేశాలనుంచీ, వివిధ రాష్ట్రాలనుంచీ, యునెస్కోవంటి అంతర్జాతీయ సంస్థలనుంచీ వచ్చిన ప్రముఖులు ప్రతినిధులుగానో, పరిశీలకులుగానో పాల్గొంటారు. ఈ మహాసభల సమయంలో చర్చాగోష్ఠులు, ప్రదర్శనలు, ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరుగుతాయి. దేశ దేశాలలోని తెలుగు

వారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలయిన విషయాలపై చర్చాగోష్ఠులు జరుగుతవి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధ కోణాలనుంచి ప్రస్ఫుటంచేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అవుతున్నది. తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయాన్ని "మ్యూజియంను" స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజభూతమవుతుంది. తెలుగువారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారం రోజులపాటు సాగుతవి. తెలుగు ప్రజల సంస్కృతీ సంప్రదాయాలను విశదంచేసే ప్రత్యేక సంచికలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ భాషలలో విడుదల అవుతాయి. ఈ కార్యక్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘన విజయాలను విశదంచేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అవుతాయి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితలందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకువచ్చిన అకాడమీ అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయులందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంతమాత్రంచేతనే ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడం లేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల సందర్భంగా నెలకొల్పబడనున్న "అంతర్జాతీయ తెలుగు విజ్ఞానసంస్థ" మహాసభల ఆశయ సాధనకు పూనుకొనడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

జలగం వెంగళరావు
అధ్యక్షులు
ప్రపంచ తెలుగు మహాసభలు.

# పరిచయము

సహస్రాబ్దాలుగా ప్రవర్ధమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగుదేశపు నలుచెరగుల పరిచితము చేయు సంకల్పముతో 1975వ సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించినది అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింపజేయుటయే గాక, ప్రపంచములోని వివిధ దేశాలలో వసించుచున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతినిధులందరును ఒకచోట సమావేశమగు వసతిని కల్పించుటకై "1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచ తెలుగు మహాసభ హైదరాబాద్‌న జరుగునటుల ప్రభుత్వము నిర్ణయించినది. అందుకు ఒక ఆహ్వానసంఘము ఏర్పాటయినది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు ఆ సంఘమునకు అధ్యక్షులు. విద్యాశాఖా మంత్రి మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు దాని కార్య నిర్వాహకాధ్యక్షులు. ఆర్థిక మంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారు ఆర్థిక, సంస్థా కార్యక్రమాల సమన్వయ సంఘాల అధ్యక్షులు.

ఆ సంఘము, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భమున వచ్చువారికి తెలుగు జాతి సాంస్కృతిక వైభవమును తెలియజేయుటకు అనువుగ ఆంధ్ర భాషా సాహిత్య, కళా చరిత్రాదికములను గురించి ఉత్తమములు, ప్రామాణికములునగు కొన్ని లఘు గ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి, ఆ కార్యనిర్వహణకై 44 మంది సభ్యులు కల ఒక విద్వత్ సంఘమును, శ్రీ నూకల నరోత్తమ రెడ్డిగారి అధ్యక్షతన నియమించినది. ఆ విద్వత్ సంఘమును ఆ లఘు గ్రంథముల వస్తువుల నిర్దేశించి వాని రచనకై ఆయా రంగములందు పేరుగనిన ప్రముఖులను రచయితలుగ ఎన్నుకొనినది. ఈ విధముగ సిద్ధమైన గ్రంథములలో భాషా, సాహిత్య, చారిత్రక విషయములకు సంబంధించిన వానిని ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వహింప వలసినదిగా ప్రపంచ తెలుగు మహాసభా కార్యనిర్వాహకాధ్యక్షులు మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు అకాడమీని కోరిరి. మహాసభా సఫలత కొరకై కృషిచేయు సంకల్పముతో ఈ బాధ్యతను వహించుటకు అకాడమీ సంతోషముతో అంగీకరించినది.

ఆ విధముగ ప్రకటింపబడిన గ్రంథశ్రేణిలో ఈ **ఆధునికాంధ్ర కవిత్వం** ను, రచించిన డాక్టర్ సి. నారాయణరెడ్డి గారు ఆంధ్ర పాఠక లోకమునకు సుపరిచితులు. వారికి మేము కృతజ్ఞతా బద్ధులము. గ్రంథమును నిర్దుష్టముగ, చక్కగా ముద్రించిన నాగార్జునా ప్రింటింగ్ వర్క్సు వారికి మా కృతజ్ఞతలు.

**దేవులపల్లి రామానుజరావు**
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

హైదరాబాద్
తేదీ॥ 30-3-1975

# ఆధునికాంధ్ర కవిత్వం

## (భావ కవితాయుగం వరకు)

### అవతారిక

కవిత్వం ఎంత పురాతనమో అంత అధునాతనం. అది ప్రధానంగా మానవుని అనుభూతులపై ఆధారపడిన కళ. అందుచేత మానవుడున్నంత కాలం కవిత్వానికి క్షతి లేదు. భౌతిక జగత్తులో ఎన్నెన్ని చిత్రమైన మార్పులు వచ్చినా, మానవునిలోని మౌలిక మనః ప్రవృత్తుల్లో చెప్పుకోదగ్గ పరివర్తనం రాలేదు. రాగద్వేషాలు, పాపపుణ్యాలు, అధికారవాంఛ, కీర్తికాంక్ష, ప్రకృతిప్రీతి, దైవభీతి సగటు మానవుణ్ని పెనవేసుకునే ఉన్నాయి. ఇవి ఉన్నన్నినాళ్ళు కవిత్వం ఉంటుంది. కవిత్వాన్ని మానవతావికాస చరిత్రలో ప్రాథమిక దశకు చెందిన కళ అనుకోవడంలోనే దోషముంది. బుక్కాల నాటి నుండి స్పుత్నిక్కుల కాలం వరకు ఇది జీవనదిలా ప్రవహిస్తూనే ఉంది.

అసలు సృష్టిలోనే నవ్యతాప్రీతి ఉంది. టెన్నీసన్ చెప్పినట్లుగా 'Old order changeth yielding place to new'. ఈ ప్రకృతి పరిణామ సూత్రమే సాహిత్యచరిత్రకూ వర్తిస్తుంది. నన్నయ మొదలుగా నేటివరకు జీవస్రవంతిగా సాగివస్తున్న ఆంధ్రసాహిత్యంలోనూ ఈ పరిణామరమ్యమైన ప్రగతే కనిపిస్తుంది. ఆంధ్ర సాహిత్యం పురాణయుగంలో మతధర్మ స్తంభాలపై ఆధారపడింది. భారత భాగవత రామాయణాలు ప్రాచీనాంధ్ర సాహిత్యానికి ముకురప్రాయంగా నిలిచినవి. నన్నయ, తిక్కన, ఎర్రన్న, పోతన సంస్కృత పురాణాలను అనువదించడంలో ప్రధానంగా కథాదృష్టినీ, విశ్వశ్రేయోదృష్టినీ కలిగి ఉన్నారే కానీ విచిత్ర కథా కల్పనలకు వినూత్న వర్ణనలకు అంతగా పాల్పడలేదు. క్రమంగా కావ్యదృష్టీ, రసదృష్టీ ప్రబలినవి. రసరాజమైన శృంగారానికి పసిడిగద్దె దొరికింది. శ్రీనాథుడు, పినవీరభద్రుడు మొదలైన ప్రబంధయుగ పూర్వకవుల చేతుల్లో శృంగారం స్ఫుటరేఖలను తీర్చుకుంది. ప్రబంధయుగంతో అది జ్వాజ్జ్వల్యమానంగా ప్రకాశించింది. ప్రబంధ ప్రక్రియ మనుచరిత్రతో సమగ్రాకృతి వహించింది కథావరణంలో, రచనా సంవిధానంలో, పాత్రచిత్రణలో, రసపోషణలో, వర్ణనా బాహుళ్యంలో ఈ ప్రక్రియ

సరికొత్తదారులు వేసుకుంది. దక్షిణాంధ్రయుగంలో ఇది వెర్రితలలు వేసింది. శృంగారం అంగాలకెక్కి అంతరంగాన్ని విస్మరించింది. విజయవిలాసం లాంటివి ఒకటి రెండు తప్ప చెప్పుకోదగ్గ ప్రబంధాలు ఈ యుగంలో వెలువడలేదు. అయితే ఈ యుగంలోని గణనీయగుణం గేయకవితా పట్టాభిషేకం. నన్నయ నాటినుండి పురాణ ప్రబంధకవుల ధాటికి తట్టుకోలేక మరుగున పడిపోయిన మాత్రాచ్ఛందస్సులు ఈ కాలంలో అందలా లెక్కినవి. ఈ కాలంలోనే ఆటవెలది ద్వారా సమకాలీన సమాజాన్ని ఒక్క ఆటాడించిన వేమన్న గొంతు వినిపించింది. ఛందస్సులో వేమన్న కొత్తదారి తొక్కకున్నా వస్తువులో గొప్ప వైవిధ్యం కనబరిచాడు. తననాటికి జడీభవించిన వైదిక సంప్రదాయాలను సాంఘిక దురాచారాలను తుత్తునియలు చేయడానికి పద్యాన్ని వజ్రాయుధంగా ప్రయోగించాడు. ప్రజల పలుకుబడిలో ప్రజల భావాలకు పట్టం కట్టి చూపాడు. ఆధునిక యుగంలోని ప్రజాకవులకు వేమన్న వేగుచుక్కలాంటివాడు

19 వ శతాబ్ది మొదటిసగం ఆంధ్రసాహిత్య చరిత్రలో క్షీణయుగం. నాడు జాతి జీవనం లాగే సారస్వంతరంగమూ నిస్తేజంగా ఉండిపోయింది. సంప్రదాయాన్ని జీర్ణించుకొని సరికొత్త ప్రయోగాలు చేసే మహాకవి పుట్టలేదప్పుడు. అనుకరణశీలం పెరిగింది చిత్రకవిత్వం మీద మమకారం ముదిరింది. పిల్ల వసుచరిత్రలు ఉసిళ్ళుగా ఉద్భవించినవి. ప్రబంధకవిత్వం క్రమంగా బంధకవిత్వంగా మిగిలిపోయింది. బూతు కావ్యాల పుట్టలు, శ్లేషకావ్యాల కట్టలు బయలుదేరినవి. ప్రబంధాలకు వసుచరిత్ర, ద్వ్యర్థి కావ్యాలకు రాఘవపాండవీయం మాతృకలై పోయినవి. అదే యెత్తుగడ, అవే సన్నివేశాలు, అవే పాత్రలు, అదే కథా శరీరం, అదే నిర్వహణం. దాదాపుగా 19 వ శతాబ్ది మధ్యభాగం వరకు ఇదేస్థితి. కందుకూరి వీరేశలింగం పంతులుగారి అవతరణంతో ఆంధ్ర సాహితి గ్రహణ విముక్తమై ఎప్పటిలా కలకలలాడింది.

## పూర్వరంగం

ఆంధ్రదేశానికి సాంఘికంగా, సాహిత్యకంగా వినూతన జాగృతిని కలిగించిన ప్రథమ వైతాళికుడు వీరేశలింగం పంతులుగారు. వారి ప్రాభాతగీతికకు ప్రాతిపదికలైన నాటి భారతీయ సాంఘిక సాంస్కృతిక స్థితిగతులను పరిశీలించవలసి ఉంది. పంతులు గారి ఉద్యమ చైతన్యానికి ఊపిరులూదిన మూలశక్తి రాజారామమోహనరాయలు. రామమోహన రాయలు విద్యావిషయంలోనే గాక బహుముఖంగా భారతదేశాన్ని సంస్కరించడానికి ప్రయత్నించిన మహామనీషి. బ్రహ్మసమాజ స్థాపనం, సహగమన నిర్మూలనం

సంఘ దురాచార నిరసనం, ఆధునిక విజ్ఞాన వ్యాపనం, అసంఖ్యాక గ్రంథరచనం రామ మోహనరాయల ఉదాత్త కార్యక్రమాళికలో గణనీయమైనవి. క్రైస్తవమత ప్రచారకులు ఇతని శేముషికి ఆశ్చర్యపడి ఎలాగైనా ఇతణ్ని తమ మతంలో కలుపుకోవడానికి యత్నింపగా, ఇతడు క్రైస్తవ మత ధర్మాలను నిశితంగా నిర్భయంగా విమర్శించాడు; సంఘ సంస్కరణం నిమిత్తం "సంవాద కౌముది" అనే పత్రికను నిర్వహించాడు. ఆంగ్ల సంస్కృత వంగ పారసీకాది భాషల్లో సంస్కరణోద్యమ ప్రచారానికి అసంఖ్యాకంగా వ్యాసాలు ప్రకటించాడు. రామమోహనరాయల ఉద్యమం వల్ల దేశీయుల్లో అపూర్వ చైతన్యం రేకులు విప్పింది. ఆంగ్ల విద్యాభ్యాస ఫలితంగా భారతీయుల్లో ఛాందసవృత్తి తొలగిపోయి సహేతుక దృక్పథం మొలకెత్తింది. ఇంగ్లీషు చదువుకున్న ప్రాచ్యభాషా పండితులు(Orientalists)వినూత్న దృక్పథంతో సాహిత్యాధ్యయనం చేశారు.విస్మృతి పాలైన జాతిరత్నాలను (Classics) పునరుద్ధరించి ప్రచురించారు. ప్రాచీన సంస్కృత గ్రంథాలను హేతుబద్ధ దృష్టితో పరిశీలించారు. క్రమంగా దేశంలో కళాశాలలు, విశ్వ విద్యాలయాలు వెలసినవి. భారతీయ జిజ్ఞాసువులకివి కల్పతరువులై నిలిచినవి. 1851 లో కలకత్తాలో "British Indian Association" అనే ప్రజాసంస్థ స్థాపింపబడింది. ఈ సంస్థ దేశీయుల రక్షణల కొరకు కృషిచేసింది. దీని స్థాపకుల్లో హరిశ్చంద్ర ముఖర్జీ రాజేంద్రలాల్ మిత్ర, ప్రసన్న కుమార టాగూరు ప్రముఖులు. 1851 ప్రాంతంలోనే జగన్నాథ్ శంకర్ సేట్ మున్నగు పుర ప్రముఖులుకలిసి బొంబాయిలో ఒక ప్రజా సంస్థను స్థాపించారు ఈ సంఘంలో చేరి దేశోద్ధరణం కోసం కృషి చేసిన వారిలో దాదాభాయి నౌరోజీ, మంగళ్‌దాస్ నాధూభాయి మున్నగు వారు గణనీయులు దక్షిణభారతదేశంలో అంతకుపూర్వమేఇలాంటి చైతన్యం వేరూని నిలచింది. 1833 ప్రాంతంలోనే ఏనుగుల వీరాస్వామయ్యంగారు, వెంబాకం రాఘవాచార్యులుగారు, శ్రీనివాస పిళ్ళగారు కలిసి "Hindu literary society" అనే ప్రజా సంస్థను స్థాపించి, సభలు జరిపి ప్రముఖులచేత ఉపన్యాసా లిప్పించారు. దక్షిణదేశంలో విజ్ఞాన వికాసానికి కృషిచేసిన వారిలో వీరే ప్రథమగణ్యులు. ఆసంస్థ ఆధ్వర్యంలో నాడు మద్రాసు సుప్రీంకోర్టులో అడ్వకేటు జనరల్‌గా ఉన్న జార్జి నార్టన్‌గారిచే 1833-34ల నడుమ ఆంగ్ల విద్యావశ్యకాన్ని గురించి, దేశచరిత్రాదులను గురించి, ప్రజల హక్కులను గురించి మహోపన్యాసాలు ఇప్పించారు. ఈ ఉపన్యాసాలు మద్రాసు పౌరుల్లో అపూర్వ రాజకీయ చైతన్యాన్ని రేకెత్తించినవి. 1838 లో ఈ సంస్థ యాజమాన్యంలో ఇంగ్లీషు కళాశాల స్థాపనావశ్యకాన్ని ఉగ్గడిస్తూ 70 వేల మంది సంతకాలతో ఒక "మెమొరాండం" జార్జి నార్టన్ గారి ద్వారా నాటి

గవర్నర్ జనరల్‌కు అందజేయబడింది. దాని ఫలితమే 1841 లో మద్రాసు యూనివర్సిటీ స్థాపనం.

హిందూమతంలోని మూఢాచారాలను, అంధవిశ్వాసాలను తొలిగివేసి దాని పురా ప్రశస్తినీ, అంతస్సత్త్వాన్నీ దేశంలో ప్రసరింపజేయడానికి ఆంధ్ర దేశంలో గొప్ప సంస్కరణోద్యమం బయలుదేరింది. అంతవరకే రాజా రామమోహనరాయలు వంగ దేశంలో బ్రహ్మసమాజాన్ని స్థాపించి దురాచార దూషితమైన హైందవ సంఘాన్ని సంస్కరిస్తూ ఉన్నాడు. ఈ సమాజంచేత ప్రభావితులయ్యే కందుకూరి వీరేశలింగం పంతులుగారు, రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు ఆంధ్ర దేశంలో సంస్కరణోద్యమాన్ని వెల్లువలా ప్రవహింపజేశారు. వీరు ఒకవైపు పూర్వాచార పరాయణులైన హిందువులను, మరి ఒకవైపు క్రైస్తవమత ప్రచారకులను ఎదుర్కొనవలసి వచ్చింది. బ్రహ్మ సమాజమే కాక దయానంద సరస్వతి స్థాపించిన ఆర్యసమాజం, మేడం బ్లావిట్స్కీ, కల్నల్ అల్కాటుగార్లు స్థాపించిన దివ్యజ్ఞాన సమాజం, స్వామి వివేకానందుల సనాతన మత పునరుద్ధరణ మహోద్యమం భారతదేశంతోపాటు ఆంధ్రదేశంలోకూడా అభినవోత్తేజాన్ని కలిగించినవి. విద్యార్థుల్లో, విద్యాధికుల్లో ఈ ఉద్యమాలు సమష్టిగా అపూర్వ సంచలనాన్ని కలుగజేసినవి. క్రైస్తవ మతప్రచారం అభావాత్మకంగా (Negative)పై ఉద్యమాల ప్రాబల్యానికి హేతువైంది. అంతేకాదు. క్రైస్తవ మతప్రచారంవల్ల ఒకటి రెండు మేళ్లు కలిగిన విషయాన్ని కూడా విస్మరించడానికి వీలులేదు వాటిలో తెలుగు భాషకు కలిగిన ప్రచారం ప్రధానమైంది. క్రైస్తవ మత ప్రచారకులు తమ మతాన్ని త్వరితగతిలో ప్రజల్లో ప్రచారం చేయడానికి ప్రాంతీయ భాషల్లో బైబిలును అనువదింపజేసే అవసరం ఏర్పడింది. అందుకు వారు నిఘంటు నిర్మాణం ప్రథమ సోపానంగా భావించి కాంబెలు దొరగారిని ఆ పనికి నియోగించారు. వారికి సహాయకులుగా ఇద్దరు తెలుగు పండితులను నియమించారు. వీరిచేత సిద్ధం చేయబడిన నిఘంటువు అక్షర క్రమంలో వ్రాయబడిన మొదటి నిఘంటువని జయంతి రామయ్యపంతులుగారి అభిప్రాయం. మత దృష్టితో వారు దీనిని సంకలనం చేయించినా తెలుగు భాషకు దీనివల్ల మహోపకారమే జరిగింది ఉద్యోగరీత్యా చెన్నపట్టణానికి వచ్చిన బ్రౌను దొరగారు కాంబెలుగారి నిఘంటువుకన్న సమగ్రంగా ఉన్న రెండు నిఘంటువులను 1852లో ప్రచురించారు ఒకటి తెలుగు నుండి ఇంగ్లీషుకు; రెండవది ఇంగ్లీషు నుండి తెలుగుకు. 1833 నాటికే ఇతడు తెలుగు సాహిత్యాన్నిగూర్చి ఒక వ్యాసం రచించాడు. 1840 వరకు ఒక తెనుగు వ్యాకరణం సంతరించాడు కురుగంటి. సీతారామయ్యగారన్నట్టుగా బ్రౌనుదొర

ఆంధ్రభాషకు అమరసింహుని వంటివాడు. వేమన శతకాన్ని ఇంగ్లీషులోకి అనువాదం చేయించి తెలుగు కవితా సౌరభాన్ని తొలిసారిగా తెల్లదొరల కందించిన మహనీయుడు ఇతడే. తాళీదళ సంపుటాల్లో సుషుప్తిలో మునిగి ఉన్న తెలుగు కావ్యాలను మేలుకొలిపి వాటికి ప్రచురణ భాగ్యాన్ని ప్రసాదించిన ప్రథమభాషా పోషకుడు ఇతడే. మన ప్రబంధ రత్నాలైన మనుచరిత్ర వసుచరిత్రలను, శ్రీమదాంధ్ర మహాభాగవతాన్నీ తొలిసారిగా ముద్రింపించి వెలుగులోనికి తెచ్చిందీ ఇతడే. అంతేకాదు. ఈనాడు అచ్చులిపిలో ఉన్న 'వత్తులు' కొన్నిటిని కనిపెట్టిందీ ఇతడే. శంకరనారాయణగారి రెండు నిఘంటువులకు బ్రౌను నిఘంటువులే మాతృకలు.

## వీరేశలింగంగారు : సంఘ సంస్కరణోద్యమం

ఫ్రాన్సు దేశంలో వాల్టేరులాగా ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణం కొరకు తన కలాన్ని కరవాలంగా ఝళిపించిన మహాపురుషుడు వీరేశలింగం పంతులుగారు. సాంఘిక దురాచార నిర్మూలనంలో నేమి బహుముఖ సాహితీ ప్రక్రియా సృష్టిలో నేమి, ఆంధ్ర జాతీయతా ప్రచారంలో నేమి వీరేశలింగం గారే పితామహతుల్యులు. రథులు, వారే సారథులు. 1874 లో వీరేశలింగం గారు 'వివేకవర్ధని' అనే పత్రికను స్థాపించారు. ఇది మాసపత్రిక, ఈ పత్రికా ప్రకటన ప్రయోజనాలు రెండని వారే తమ స్వీయ చరిత్రలో వ్రాసుకున్నారు. ఒకటి భాషాభివృద్ధి; రెండవది దేశాభివృద్ధి. తెలుగు భాషలో మృదువైన సరళమైన శైలిలో సలక్షణ వచన రచన చేయడం భాషాభివృద్ధి మార్గమనీ, దురాచారాలను నిర్మూలించి మత కులాచార విద్యా నీతి విషయాలలో బహుముఖ కృషి చేయడం దేశాభివృద్ధి మార్గమని వారు వివరించారు. లంచగొండితనాన్ని బట్టబయలు చేయడంలో, స్త్రీ విద్యా విషయంలో, వితంతు వివాహ విషయంలో వీరేశలింగంగారి కృషి అనన్యం. వారు 1881 లో రాజమహేంద్రవరంలో ఒక నాటక సమాజాన్ని స్థాపించి 'చమత్కార రత్నావళి' అనే రెండు నాటకాలను ప్రదర్శించారు. ఇవి ప్రహసన రూపంలో ఉన్నాయి. ఈ ప్రదర్శనలతో నగరంలో మహత్తర సంచలనం కలిగింది. 1881 డిసంబరు 1 వ తేదీన రాజమహేంద్రవరంలో మొదటి వితంతు వివాహం జరిపించి పంతులుగారు సంఘ సంస్కరణోద్యమానికి పతాక స్థాయి కలిగించారు.

సంఘ సంస్కరణోద్యమంతో పాటు సాహిత్య కేదారంలో ఎన్నో క్రొత్త అంట్లను నాటిన భవిష్యద్రష్ట వీరేశలింగంగారు. గద్యవాఙ్మయాన్ని క్రొత్త దారులలో

నడిపించడంలో వారే ఆద్యులు. కావ్య నాటకాలే కాక తెలుగులో ప్రకృతిశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం, శారీర శాస్త్రం, పదార్థ వివేచనా శాస్త్రం, భౌతిక భూగోళ శాస్త్రాలకు సంబంధించిన గ్రంథాలు, అలంకార సంగ్రహం, ఆంధ్ర తర్కసంగ్రహం మున్నగు గ్రంథాలను రచించి బహువిధ వాఙ్మయ సృష్టిని చేసిన చతుర్ముఖుడు ఆయన. వీరి ఆంధ్ర కవుల చరిత్ర ప్రచురణతో నన్నయ, తెనాలి రామకృష్ణకవి ప్రభృతులకు సంబంధించిన కట్టుకథలు మటుమాయమై పోయినవి. మధునా పంతుల సత్యనారాయణ శాస్త్రి గారన్నట్లు పంతులుగారు ఐదవ వాచకం మొదలుకొని ఆంధ్రకవుల చరిత్ర వరకు రచించిన బహుముఖ ప్రజ్ఞాశాలి. "తెలుగులో వచన ప్రబంధమును నేనే చేసితిని, మొదటి నాటకమును నేనే తెనిగించితిని, మొదటి ప్రకృతి శాస్త్రమును నేనే రచించితిని, మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని, మొదటి చరిత్రమును నేనే రచించితిని, స్త్రీలకై మొదటి వచన పుస్తకమును నేనే కావించితిని"—అని పంతులుగారే స్వయంగా తమ స్వీయ చరిత్రలో వ్రాసుకున్న మాటలను బట్టి వారు ఎన్ని రకాలైన ప్రయోగాలు చేశారో స్పష్టమవుతుంది.

సాంఘిక సంస్కరణ రంగంలో అత్యంతం పదును గల వీరేశలింగం గారి లేఖిని కవిత్వ విషయంలో మాత్రం మెత్తబడిపోయింది. సాంఘిక రంగంలో ఆయన వీరావేశంతో విజృంభించిన అతివాది. కవితా రంగంలో మాత్రం కడుపులోని చల్ల కదల కుండా నడిచిన మితవాది. సాంఘిక విషయాలలో ఆయన చూపిన విప్లవావేశాలను కవితా రంగంలోనే చూపి వుంటే 19 వ శతాబ్ది ఉత్తరార్థంలోనే కవితా సతికి బంధవిముక్తి కలిగి స్వేచ్ఛావాయువులను పీల్చేది. పంతులుగారు ఆంగ్ల సాహిత్యంతో గట్టి పరిచయం కలవారే. అయినా వారి దృష్టి ఆంగ్లంలోని గద్యరచయితల మీదనే ప్రధానంగా ప్రసరించింది. కవులలో వారు గోల్డ్‌స్మిత్‌ను దాటిపోలేదు. వర్డ్స్‌వర్త్ మున్నగు కాల్పనికోద్యమ కవులు సాహిత్యలోకంలో పయనించిన వినూతన పథాలపై వీరేశలింగం గారి దృష్టిపడినట్లు లేదు. అందువల్లనే ఆయన 1892 లో గోల్డుస్మిత్ కావ్యాన్ని "పథిక విలాసము" అనే పేర తెనిగించారు.

బాల్యదశలో ఆనాటి కవులందరి లాగే వీరేశలింగం గారు మార్కండేయ శతకం వంటి శతకాలను రచించారు. తరువాత కొన్నేళ్ళకు శృంగార రసోల్బణమున్న "శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము" అనే ప్రబంధాన్ని రచించారు. తదనంతరం గర్భకవిత్వాన్ని వెలయించారు. కవిత్వ విషయంలో మొదట ఇంతగా సంప్రదాయ ప్రవాహంలో కొట్టుకుపోయినా, 1887 నాటికి నానాటికి దిగజారిపోతున్న తెలుగు

కవిత్వం దుస్థితి పంతులుగారికి కడుపులో చేయివేసి కలచినట్లనిపించిఁది. ఆ గర్భ వేదనయే 'సరస్వతీ నారద విలాపము'గా వెలిజిమ్ముకొని వచ్చింది.

## సరస్వతీ నారద విలాపం

నారదుడు తన తల్లి సరస్వతి దీనస్థితిని చూసి ఆనవాలు పట్టలేక కారణ మడుగగా సరస్వతీదేవి తన దురవస్థను చెప్పుకోవడం ఈ పద్యాలలోని వస్తువు. ఇది ఉత్తర ప్రత్యుత్తర రూపంలో వున్న సంవాదకృతి. రచనా స్వరూపాన్ని బట్టి ఖండ కావ్యమనవచ్చును. అర్థ సారస్యాన్ని పూర్తిగా చెరచి, అవయవాలను విరిచి, భాషావ ధూటిని విరూపిణిగా, శవప్రాయంగా చేసిన వారిని పంతులుగారు ఈ పద్యాలలో నిశితంగా విమర్శించారు. తొల్లిటి కవులు "రమణీయోక్తుల చేత అర్థగుణ సారస్యము" కల్పిస్తూ, సహజ సౌందర్యాన్ని పెంపొందిస్తూ, కించిదలంకారాలతో 'చేష్టా చమ త్కార భాగ్యము" హెచ్చిస్తూ తనను కాపాడినారనీ, ఇప్పటి కవులు "రసము నెట్టి" "అలంకరణ కైతవముతో మేను కుట్టి" ప్రాణం తీస్తున్నారనీ, సరస్వతి నారదునితో మొరపెట్టు కుంటుంది. ఆమె ఇంకా ఈ విధంగా విలపిస్తుంది.

"తెలియదు సుమ్మిప్పుడు నా
పలుకుల యర్థంబు నాకె భావము లేమిన్
వెలసొమ్ములుగా కివి సం
కెలలయి కడు నాదుమేనికిన్ వెత నించున్."

"దయమాలి తుపముట్ట తలకట్లు నిగిడించి
ధీరుడై నన్ను బాధించు నొకడు,
పాదంబులోపల పాదంబు లిమిడించి
వీరుడై నన్ను నొప్పించు నొకడు.
ప్రాసంబుపై పెక్కు ప్రాసంబు లదరించి
పోటుబంటయి నన్ను పొడుచు నొకడు
బెండు పల్కులు గూర్చి నిండైన నగలంచు
దిట్టయై చెవులు వేధించు నొకడు
ఖడ్గ చక్రాది రూపముల్ గానిపించి
వర్ణముల్ మార్చి నను ఓక్కుపరచు నొకడు
కుమతు లొడలెల్ల విరిచి ప్రాణములు తీయ
ఒడలిపస లేక ఋష్కించి యున్నదాన".

శ్లేష చమత్కారాలతో ఆంధ్ర భారతికి పట్టిన గ్రహణ స్థితిని ఈ పద్యాలలో పంతులు గారు ఎత్తి చూపారు. గర్భబంధ చిత్రకవిత్వాలనూ, వ్యర్థపదాడంబరాలనూ, రసహీన పద సంపుటులనూ అలంక్రియలు కాక శృంఖలలనీ ఎలుగెత్తి చాటారు. ఛందో బద్ధమైనంత మాత్రాననే పద్యం కవిత్వం కాదనీ, రసాత్మకమైనది మాత్రమే కావ్యమనీ నొక్కి చెప్పారు. ఈ విధంగా వీరేశలింగంగారు కేవల బాహ్యాడంబర జృంభితమై, అంతశ్శోభారహితమై వున్న ఆంధ్ర కవిత్వంలో కలుగవలసిన మార్పును ఏనాడో గమనించారు. * ఇరవయ్యో శతాబ్దిలోని నవ్యకవిత్వ భానూదయానికి ఈ పరివర్తనం నేపథ్యం నుండి అంధకార నిరాసానికి దారి తీసింది. వీరేశలింగంగారి అభిప్రాయాలకూ నవ్యతా ప్రీతికీ ఒక ఆకృతి కలిగించిన కవి కట్టమంచి రామలింగారెడ్డిగారు.

## 'ముసలమ్మ మరణము'

కాలరీత్యా ఈ కావ్యం భావకవిత్వ ప్రాదుర్భావానికి దాదాపు రెండు దశాబ్దులు ముందుగా పుట్టింది. రెడ్డిగారి ఆంగ్లసాహిత్య పరిచయమే వారిచేత ఈ సరికొత్త కావ్యాన్ని రచింప జేసింది. రెడ్డిగారు ఈ కావ్యవస్తువును బ్రౌనుదొర ప్రకటించిన 'అనంతపుర చరిత్ర' మనే గ్రంథం నుండి గ్రహించి రసోచితాలైన మార్పులు చేసి రచించారు అనంతపురానికి సమీపంలో 'బుక్కరాయ సముద్రం' అనే గ్రామముంది. ఆ ఊరి చెరువుకట్టకు నేటికీ 'ముసలమ్మ కట్ట' అనే వాడుక ఉంది. ఆ పేరు రావడానికి ఒక చిన్నకథ కూడా ఉంది ఒకప్పుడు 'బుక్కరాయ సముద్రం' (చెరువు) పొంగి కట్ట తెగిపోయిందట. ఊరి రైతులు పోలేరమ్మను ప్రార్థింపగా, ఆ ఊరిలోని 'ముసలమ్మ' అనే వనిత బలి అయితే ఆపన్నివారణం జరుగుతుందని అశరీర వాణి పలికిందట. ముసలమ్మ సాధ్వీలలామ. కరుణాంతరంగ. ప్రాణప్రదుడైన భర్తనూ అత్తమామలనూ, బంధుమిత్రులనూ విడిచి మెట్టినూరిని రక్షించడానికి నీటిలో మునిగి పరమపదించిందట. సంగ్రహంగా ఈ కావ్యంలోని కథ ఇది. 'సమష్టి' కోసం 'వ్యష్టి' ఆత్మాహుతి చేసుకున్న కరుణరసాత్మకమైన గాథ ఇది.

ఈ కావ్యంలో నవ్యత రెండంశాలలో వుంది. ఒకటి—అచ్చమైన సాంఘిక వృత్తంతో ఒక స్వతంత్ర కావ్యాన్ని రచించడం. రెండు—కథ మరణాంతంగా సమాప్తి

* ఈ 'సరస్వతీ నారద విలాపం'పై స్పెన్సర్ వ్రాసిన "టియర్స్ అఫ్ ది మ్యూజెస్" అనే గేయం ప్రభావం వున్నట్లు తోస్తున్నది. ఈ గేయంలో స్పెన్సర్ ఆంగ్ల సాహిత్యం ఏ విధంగా క్షీణ దశ పాలవుతున్నదో Muses (విద్యాదేవతల) ముఖతః వెల్లడించాడు.

కావడం. ఈ రెండు లక్షణాలూ ఆ కాలానికి కొంతవరకు కొత్తవే. కానీ ఒకటి రెండు నవీనతా రేఖలు ఉన్నంత మాత్రాననే ఇది నవ్యకావ్యమనడానికి వీలులేదు. ప్రాయికంగా ఇది ప్రబంధ మార్గంలో నడిచిన లఘుకావ్యం. అయితే ఇది వర్ణనా ప్రధానం కాకుండా కథా ప్రధానమైన కావ్యం కావడం విశేషం. ఛందస్సులో, రచనా సంవిధానంలో, కథాగతిలో ఇది ప్రాచీన కావ్య సంప్రదాయాలనే అనుసరించింది. వస్తువులో, కథను మరణాంతం చేయడంలో మాత్రం కించిన్నవ్యతను సంతరించుకుంది. ఈ గుణాలతో పాటు దీనిలోని నాయికా నాయకులు ప్రభువంశాల నుండి కాక సామాన్యుల కుటుంబాల నుండి గ్రహింప బడడం వలన ఈ కావ్యాన్ని 'సంధి' కావ్యం అనవచ్చును. పింగళి లక్ష్మీకాంతం గారన్నట్లు రానున్న నవ్యకవితా ప్రభాతానికి ఇది వేగుచుక్క లాంటిది.

## తిరుపతి వేంకట కవులు

19 వ శతాబ్ది చివరి పాదం నుండి 20 వ శతాబ్ది మధ్యభాగం వరకు తమ విశృంఖల కవితా విహారంతో, అష్టావధాన శతావధాన ఆశుకవిత్వాది ప్రక్రియలతో ఆంధ్ర సాహితీలోకానికి పులకలు వెలార్చిన కవిధీరులు తిరుపతి వేంకట కవులు. కవితా రచనలో వీరు చెప్పుకోదగ్గ నవ్యతను సాధించకున్నా. నవ్య కవిత్వోదయానికి పూర్వమే కొన్ని కొత్త పుంతలు తొక్కిన కింకవీంద్ర ఘటా పంచాననులు. వీరేశ లింగంగారు దీర్ఘసమాస భూయిష్ఠమూ, కృత్రిమ పదజుష్టమూ అయిన వచన ప్రక్రియను సరళ సుందరంగా మార్చినట్లే, అనవసర భాషా భేషజంతో, అర్థంలేని పదడింది మార్చటులతో ఉక్కిరిబిక్కిరవుతున్న కవితా సరస్వతికి వీరు సహజ రామణీయకాన్ని ప్రసాదించారు. గహనాల వంటి ఘన ప్రబంధాలతో తెలుగు ప్రజలకు ఊపిరాడని దినాలలో ఉద్యానాల వంటి ఉత్తమ కావ్యాలను సృష్టించారు. చిరకాలంగా ఘనీభవించి వ్యవహార దూరమైన వ్యాకరణ సూత్రాలు కొన్నిటిని ఉల్లంఘించారు. గ్రాంథికతా ముద్రకు వెలియై, అస్పృశ్యాలుగా పరిగణింప బడుతున్న వ్యావహారికపు పలుకు బడులను కావ్యాలలో యథేచ్ఛంగా ప్రయోగించారు. రాజాస్థానాలకే పరిమితమనుకున్న కవితా సంపదను రచ్చపట్టుల కెక్కించారు. శ్రీనాథుని తర్వాత తెలుగు కవిత్వానికి బహుళ వ్యాప్తి కలిగించిన కవులు వీరే.

వీరి కావ్యాలలో కొంత నవ్యతాగుణం కలిగివున్నవి శ్రవణానందం, పాణి గృహీత. వీరేశలింగంగారు ప్రారంభించిన వేశ్యావృత్తి వ్యతిరేకోద్యమ ప్రభావంతో వ్రాసిన కావ్యాలివి. వేశ్యా సాంగత్యం సర్వానర్థాలకు బీజమని ఈ కావ్యాలందించే సందేశం. వీరి 'గీరతం' భారతానికి దీటుగా వ్రాయబడిన కావ్యం. ఇది అధిక్షేపాత్మక

మైన కావ్యం కావడం వల్ల ప్రక్రియను బట్టి కొంత కొత్తదనాన్ని సంతరించుకున్నది. 'తెలుగునకున్న వ్యాకరణ దీపము చిన్నది' అని వీరన్నారు. చిన్నయసూరి బాల వ్యాకరణం వెలువడిన అనంతరం కూడా వీరు ఇలా ప్రకటించడం వీరి విశాల దృష్టికీ పరిణామ శీలతకూ నిదర్శనం. కాలాన్ని బట్టి భాష మారుతుందని ఉద్ఘాటించి వీరు గిడుగువారి సిద్ధాంతాలకు ఒరవడి దిద్దారని చెప్పాలి. అయితే ఆ సిద్ధాంతాలకు అక్షరాకృతి గురజాడ వారి కవిత్వంలోనే సమగ్ర సుందరంగా లభించింది. దీనిని కాదన లేము. ఏది యెట్లావున్నా దక్షిణాంధ్ర యుగంలో క్షీణదశపాలైన పద్యకవిత్వం తిరుపతి వేంకటకవుల చేతిచలువ వల్ల పునర్వికాసం పొందింది. పింగళి లక్ష్మీకాంతం గారన్నట్లుగా "ఈ మహాకవుల వాక్కు ప్రాచీన సరణికి భరత వాక్యము; నవీన సరణికి నాందీ వాక్యము."

1900 నుండి 1909 వరకు ముసలమ్మ మరణం వంటి నవ్యతా గంధమున్న గ్రంథమేదీ ప్రచురింపబడలేదు. 1909 లో రాయప్రోలు సుబ్బారావుగారి 'లలిత', 1910 లో గురజాడ అప్పారావుగారి 'ముత్యాల సరాలు' ప్రచురణతో నవ్యకవితా శంకుస్థాపన జరిగింది. ఈ నడిమి పదేళ్ళలో నవ్యకవిత్వం పుస్తక రూపంలో రానప్పటికీ కొన్ని పత్రికల్లో వెలువడుతూనే వచ్చింది. ఈ మధ్యకాలంలో సాహిత్య సేవకై రంగస్థలంలో నిల్చిన పత్రికల్లో కల్పలత, మంజువాణి. మనోరమ, కళావతి, సరస్వతి, తెలుగు జనానా పత్రిక గణనీయమైనవి. 1909 లో బయలుదేరిన 'ఆంధ్ర భారతి' ఆ రోజుల్లో నేటి 'భారతి' వలె సాహిత్యసేవ చేసింది. ఈ పత్రిక చెన్నాప్రగడ భానుమూర్తి, రాయప్రోలు సుబ్బారావు. గురజాడ అప్పారావు మున్నగు ప్రముఖ కవుల కవితలను ప్రచురించింది.

## మొదటి ముత్యాల సరం ?

'ఆంధ్ర భారతి' (శా.శ.1831...క్రీ. శ. 1909 మాఘ) సంచికలో 'మేలుకొలుపు' అనే శీర్షికతో ఒక గేయం ప్రచురింపబడింది. ఇది ప్రధానంగా ప్రబోధాత్మక గేయం. కవి పేరు లేదు. అప్పటికి గురజాడవారి ముత్యాల సరాలు వెలువడ లేదు. కాని ఆ సంచికలోనే వారి 'నీలగిరి పాట'లలో ఒకటైన 'పూటి చోద్యమేమి చెపుదు' అనేవి ప్రచురింప బడింది. ఈ 'మేలు కొలుపు' గేయం మిశ్రగతిలో ఉంది. అంటే—గురజాడవారు 1910 లో ప్రచురించిన 'ముత్యాల సరం' ఛందస్సులో ఉండిన్నమాట. అయితే ఈ గేయం ముత్యాలసరం లాగా నాలుగు పాదాలుగా అచ్చు

కాలేదు. వారి రెండు పాదాలు ఈ గేయంలోని ఒకేపాదం. ప్రతి రెండు పాదాలకు ప్రాసనియమముంది.

"మేలుకొనుమీ భరత పుత్రుడ, మేలుకొనుమీ సుజన పుత్రుడ
మేలు కొనుమీ సచ్చరిత్రుడ, మేలుకొనవయ్యా ! వత్సా ! మేలుకో—
వేడుకను జాతీయత యను, వేగుచుక్క పొడిచె నదుగో
కూడి వందేమాతరమ్మను, కుక్కుటము లరచెన్— ॥ వత్సా ! ॥"

ఇలా సాగిన గేయమిది. ఇందులోని 'వత్సా ! మేలుకో' అనే భాగం తీసివేస్తే ఇది ఆచ్చంగా ముత్యాల సరంగా రూపొందుతుంది. గురజాడవారు ఇంతకంటే ముందుకు సాగిపోయి, ప్రాసనియమాన్ని విసర్జించి, వ్యావహారిక భాషాపదాలను ప్రయోగించి అపూర్వమైన నవ్యతను సాధించారు. అయితే వీరి ముత్యాలసరాల కంటే ఒక్క సంవత్సరం ముందుగా ఈ గేయం వెలువడడం గమనింపదగిన అంశం. పైగా దీని లోని వస్తువు కూడా గురజాడవారి సాంఘిక ప్రబోధానికి సన్నిహితంగా ఉంది. రచనా రీతి కూడా వారి శైలికి సహోదరంగా ఉంది. సర్వాంగీణత కొరవడినా మొట్టమొదటి ముత్యాలసరం ఇదే అని చెప్పాలి. భారత జాతీయోద్యమాన్ని—ముఖ్యంగా 'వందే మాతరం' ఉద్యమాన్ని గేయరూపంలో ప్రకటించిన మొదటి రచన కూడా ఇదే అని చెప్పాలి.

'ఆంధ్ర భారతి' (1910) జేష్ఠమాస సంచికలో గురజాడవారి మొట్టమొదటి నవ్యగేయం 'తోకచుక్క' ప్రచురింప బడింది. శ్రావణ సంచికలో వారి 'కాసులు', భాద్రపద సంచికలో 'డామన్ పిథియస్' వెలువడ్డాయి. ఆ సంచికలోనే 'మాలవాంఢ్ర పాట' అనే గేయముంది. కర్త పేరు లేదు. అది వ్యావహారిక భాషలో - అందులో కింది తరగతులు వాడుకునే గ్రామ్యభాషలో వ్రాయబడిన గేయం. వ్యాకరణ నియమాలను సంపూర్ణంగా ఉల్లంఘించి, గ్రామ్యభాషకు పట్టం కట్టిన ప్రథమగేయమిది. తరువాతి కాలంలో నండూరి వారు ఎంకిపాటల్లో ప్రయోగించిన భాష ఈ కోవకు చెందిందే. కానీ ఇంతకంటే నగిషీ నాజూకులున్నది. గురజాడ వారు ఈ రకమైన గ్రామ్యభాషను స్వీకరించలేదు. వారు ప్రయోగించిన వ్యావహారికం శిష్టులదే. గురజాడవారు 'లవణ రాజు కల'లో చూపిన వర్ణభేద నిరసనం ఈ గేయంలోనే వ్యక్తం కావడం గమనార్హం. అలనాడే అస్పృశ్యతకు వ్యతిరేకంగా గొంతెత్తిన గేయమైనా ఇది గణనకెక్కక పోవడానికి కారణం ఇందులో కవితా గుణం లోపించడమే.

1910 తర్వాత ఆంధ్ర సాహిత్య రంగంలో అపూర్వ సంచలనం కలిగింది. 1909లో రాయప్రోలు వారి 'లలిత' ప్రచురితమైంది. 1910 లో వారి 'అనుమతి' వెలువడింది. 1910 లో గురజాడవారి ముత్యాలసరాలు సంపుటిగా వెలువడి పాఠకులను సమ్మోగ్ధమొనర్చాయి. ఈ సంవత్సరమే 'ఆంధ్రపత్రిక' ఉగాది సంచిక అవతరించింది. 'ఆంధ్రభారతి' వెనుకటిలాగే నడక సాగించింది. ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు వెంకట పార్వతీశ్వరులు, మంగిపూడి వెంకటశర్మ, రాయప్రోలు సుబ్బారావు మున్నగు యువ కవీంద్రుల తరుణకవితలకు అరుణకాంతులను ప్రసాదించింది.

1915లో ప్రారంభమైన 'గ్రంథాలయ సర్వస్వము' అనే పత్రిక రాయప్రోలు వారి రమణీయ కవితా లాస్యాలకు రంగస్థల మైంది. ఈ పత్రికే అబ్బూరి రామకృష్ణ రావు, బసవరాజు అప్పారావు మున్నగు యువకవుల ఖండకావ్యాలను ప్రచురించింది. భారతి, శారద, సాహితి, ప్రతిభ వంటి సాహిత్య పత్రికలు వెలువడే వరకు పైన పేర్కొన్న పత్రికలే నవ్య కవిత్వానికి దోహదం కలిగించాయి. 1910 నుండి 1920 లోగా రాయప్రోలు వారి కలంనుండి కావ్యాలూ గీతాలు వెలువడి రసికుల రసనాగ్రాలపై నిలిచాయి. ఈ పదేళ్లలోగానే గురజాడవారికి అనుయాయులు బయలుదేరారు. 1909 లో నాటబడిన నవ్యకవిత్వ బీజం ఈ పదేళ్ళలో అంకుర పల్లవాది దశలను అధిగమించి కుట్మలించి కుసుమించింది.

## నవ్యకవిత్వోదయ హేతువులు

నవ్యకవిత్వోదయానికి ప్రధానహేతువులు ఐదు. (1) సంఘ సంస్కరణోద్యమం (2) ఆంగ్ల విద్యావ్యాప్తి (3) పత్రికా వ్యాప్తి (4) వ్యావహారిక భాషోద్యమం (5) స్వదేశీయోద్యమం.

కందుకూరి వీరేశలింగం పంతులుగారు, రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు బ్రహ్మసమాజానికి పట్టుకొమ్మలై సంఘ సంస్కరణావేశాన్ని ప్రకటించారు. హైందవ సంఘంలోని బాల్యవివాహాలు, వృద్ధ వివాహాలు, విగ్రహారాధనలు పంతులుగారి వజ్రఘాతాలకు ఎరయైనవి. ఆనాటి యువకులకు ఈ సంస్కరణోద్యమం ఎంతగానో ఉపకరించింది. ఆంగ్ల విద్యావ్యాప్తి వల్ల ఒకవైపు ప్రజలలో విద్యావిజ్ఞానాల పట్ల శ్రద్ధాసక్తులు పెరుగుతూ ఉండగా, ఇంకొకవైపు ఆంగ్ల సాహిత్యంలోని అద్భుత విషయాలు ఉన్నత విద్యనభ్యసించే వారికి మిరుమిట్లు గొలుపుతూ వుండేవి. టెన్నిసన్, వర్డ్స్వర్తు, షెల్లీ, కీట్సు, షేక్స్పియర్ మున్నగు ఇంగ్లీషు కవుల రసవత్తర కావ్యాలను సరిను

ర్యంగా పఠించడంతో దేశీయులలో అపూర్వమైన చిత్తోన్మేషం, ధీవికాసం కలిగే అవకాశం ఏర్పడింది. తాముకూడా అలాంటి కవితలు వ్రాస్తే బాగుంటుందనే కాంక్ష కొందరిలో ఉదయించింది. పెటపెట లాడే సుదీర్ఘ సర్గ బంధాలకు స్వస్తి చెప్పి పటికి ముక్కల వంటి చిటిపొటి కవితలు చెప్పాలనే ఉత్సాహం క్రేళ్లురికింది. తత్పర్యవసానంగా విద్యార్థి దశలోనే కొందరాంధ్రయువకులు నవ్యరీతులలో ఖండకావ్య రచన చేయడం ప్రారంభించారు. అప్పటికే వంగాది భాషల్లో అభినవరచనారీతులకు పాదు లేర్పడ్డాయి. ఆయా భాషల నుండి తెలుగులోకి అనువదింప బడిన గ్రంథాలు కూడా దేశీయులలో భావవిప్లవానికి సహాయకారులైనవి. నవ్యకవుల ఖండకావ్యాలకు పత్రికలే ప్రధాన వాహిక లైనవి.

వ్యావహారిక భాషోద్యమం మొదట గిడుగు గురజాడలతో ప్రారంభింప బడినా క్రమంగా అది శ్రీనివాసయ్యంగారు ఏట్సుదొర మున్నగు విద్వాంసుల సహకారాన్ని పొంద గలిగింది. జయంతిరామయ్య పంతులుగారు కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి గారు శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రిగారు మొదలైన ఉద్దండ పండితులూ తరువాత కాలంలో ఆంధ్ర సాహిత్య పరిషత్తు ఈ ఉద్యమాన్ని ఎంతగా ప్రతిఘటించినా గరుడుని పక్ష యుగ్మంలా గిడుగు గురజాడల సంకల్పం మొక్కవోకుండా ముందుకు సాగింది. గురజాడవారు 'కన్యాశుల్క'మనే నాటకాన్ని రచించి, వ్యావహారిక భాషకు రసోత్పాదన శక్తి లేదనే పండితుల అభిప్రాయాన్ని పరాస్తంచేశారు. మొత్తం మీద వ్యావహారిక భాషోద్యమం యువకవుల భుజం తట్టి, వారిచేత స్వచ్ఛంద రీతిలో సరికొత్త రచనలు చేయించడానికి సాయపడింది.

వంగరాష్ట్ర విభజన వంగ ప్రజలలో గొప్ప ఆందోళనాన్ని లేవదీసింది. ఈ ఉద్యమం స్వరాజ్యవాంఛకు దోహదం చేసింది. స్వదేశీ వస్తువులపై ఏక్కడలేని మక్కువను కలుగజేసింది. విదేశ వస్తు బహిష్కారానికి దారితీసింది. స్వభాషాభిమానానికి పాదులువేసింది. ఈ ఉద్యమం క్రమశః భారత దేశమంతటా శాఖలు సాచి విస్తరించింది. 'వందే మాతరం' అనే సినాదం దిక్కులను కుద్దాలింప సాగింది. ఆ ప్రభావంతో ఆంధ్రదేశం ప్రబుద్ధమై క్రుద్ధమై నిలిచింది. తెలుగునాట వెల్లువవలె భావ గీతాలు పరవళ్లు తొక్కినవి. ప్రబోధగీతాలు ప్రసారితమయినవి. అన్యాపదేశంగా దేశభక్తిని ప్రబోధించే అనేక ఖండకావ్యాలు చిమ్ముకొని వచ్చినవి.

## నవ్యకవిత్వ లక్షణాలు

నవ్యకవిత్వానికి ఆధునిక కవిత్వం, అభినవ కవిత్వం, భావకవిత్వం (Lyrical Poetry) అనేవి పర్యాయ పదాలుగా వున్నవి. వీటిలో ఆధునిక కవిత్వమన్నది కాల

వాచి. కానీ ఆధునికత్వం అనే పదాన్ని కాలవాచిగా గ్రహిస్తే ఈ శతాబ్దిలో వెలువడిన జనమంచివారి బ్రహ్మాండ పురాణం, శ్రీపాదవారి యాజ్ఞవల్క్య చరిత్ర మొదలైన కావ్యాలు ఆధునిక కవిత్వ పరిధిలోకే వచ్చిచేరుతాయి. అందుకే రవీంద్రనాథటాగూర్ కవిత్వంలో ఆధునికత్వం అంటే స్వభావాన్ని బట్టిన ఆధునికత్వమే కానీ కాలాన్నిబట్టి కానేకాదని స్పష్టపరిచారు. ఇకపోతే భావకవిత్వం, Lyrical Poetry అనే పదాలు ఒకే అర్థంలో వాడబడినవి. మరి 'అభినవకవిత్వ మనేది నవ్యకవిత్వానికి పర్యాయ పదమే. ఈ పదాలన్నిటిలో నవ్యకవిత్వమే సముచితంగా వుంది. నవీన గుణాలు కలిగిన సమస్త ఆధునిక కవితా ప్రక్రియలకు ఈమాట సరిపోతుంది.

## i. ఖండ కావ్య ప్రక్రియ

ఖండకావ్యం నవ్యకవిత్వంలో ప్రథమ గణ్యమైన ప్రక్రియ. ఇరవయ్యో శతాబ్ది ప్రారంభంలో ఇది తెలుగు సాహిత్యంలో మొలకెత్తింది. పాశ్చాత్య విజ్ఞాన ఫలితంగా ప్రజలు త్వరజీవనానికి అలవాటు పడ్డారు. వారికి మహాకావ్యాలను పఠించే ఓపిక, తీరిక కొరవడినవి. స్వల్పకాలంలో అనల్పానందాన్ని అందించే కావ్యప్రక్రియ కావలసి వచ్చింది. ఆంగ్ల సారస్వతంలోని రసగుళికలైన ఖండకావ్యాలతో తెలుగు వారికి పరిచయం ఏర్పడింది. వాటిని చదివి ముగ్ధులై వాటి ప్రభావంతో నాటి యువకవులు ఖండకావ్య రచనకు పూనుకొన్నారు. కాబట్టి మన ఖండకావ్యాల సృష్టికి ప్రధాన హేతువు ఇంగ్లీషు కవిత్వమేనని చెప్పవచ్చును.

## ii. ఆత్మాశ్రయరీతి

నవ్యకవిత్వ లక్షణాలలో రెండవది ఆత్మాశ్రయ కవితారీతి (Subjective Poetry). మన ప్రాచీన కవిత్వంలో వస్త్వాశ్రయ కవితా మార్గమే (Objective Poetry) నూటికి తొంబదితొమ్మిదిపాళ్ళు కనిపిస్తుంది. ప్రాచీన కవుల్లో శతక కవులు తప్ప అందరూ ఈ మార్గాన్ని అవలంబించిన వారే. ఆత్మాశ్రయ కవితారీతిలో భక్తి కానీ, సుఖంకానీ దుఃఖంకానీ, ప్రణయంకానీ ప్రళయంకానీ కవియే స్వయంగా అనుభవించి ఆలోచించి సూటిగా కవితా రూపంలో చెబుతాడు. అంతమాత్రాన ఆత్మాశ్రయ రీతిలో లోకవృత్త ప్రదర్శనకు, వస్తువైవిధ్య ప్రకటనకు వీలులేదని శంకించ వలసిన అవసరం లేదు. ఈ రకమైన కవిత్వంలో కథాపూరణ ప్రయత్నం వుండదు. అనవసరమైన వర్ణనలు దిగుమతి చేసే అవసరం వుండదు. చెప్పినదంతా మేలిమి ముద్దగా వుంటుంది. అందుకే దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఇలా అన్నారు "ఉత్తమమైన ఆత్మపర

మైన కావ్యంలో ఉన్నంత కవితా లావణ్యం మరొక కావ్యంలో వుండదు. ఊపినచోట అది ఊపినంత మరొకటి ఊపదు".[1] ఆత్మాశ్రయ కవిత్వరీతిలో ఒక భ్రమప్రమా దానికి ఫీలున్నది. కవి వ్రాసిన సమస్త కవిత్వానికి ఆతనితో సంవాదముందో లేదో అని పరిశీలించడమది. రాయప్రోలు వారు ప్రతిపాదించిన అమలిన శృంగార సిద్ధాంతాన్ని అయన వ్యక్తిగత జీవితంలో వెతికి చూడవలసిన అవసరం లేదు. అది ఒక సిద్ధాంతం. దానిని వారు కావ్యముఖతః ఎలా వెల్లడించారన్నదే మనకు కావలిసింది. కృష్ణశాస్త్రిగారి కృష్ణపక్షంలో అధికభాగం విషాదభావ శబలితమైన మాట నిజం. అందులో "కంటక కిరీట ధారినై కాళరాత్రి మధ్యవేళల జీమూత మందిరాల"లో కొలువు తీరుస్తానని కవిగారు ప్రకటించారు. అంతమాత్రాన ఆ విషయాన్ని వారి వ్యక్తిత్వానికి ఆపాదించడం హాస్యాస్పదం. ఆ పద్యాలలో ప్రకటితమైన భావావస్థతో మాత్రమే కవికి సంబంధ ముంది. ఆ ప్రత్యేక భావాలను తనవిగా భావించి, అనుభవించి, మథనపడి, మననం చేసుకుని సుందర పద జాలంలో కవి వ్యక్తం చేశాడు. అందరికీ కేవలం ఇంద్రియ గోచరమైన సత్యాన్నీ, సౌందర్యాన్నీ తన గుండెలో రంగరించుకుని, ఆత్మీకరించుకుని, వాడిగా వేడిగా జవజీవాలతో ప్రకటిస్తాడు ఆత్మాశ్రయ రీతిలో రచన చేసే కవి. కాబట్టి అత్మాశ్రయ కవిత్వానికీ, కవి వ్యక్తిత్వానికి ఒకవేళ కొన్ని పోలికలు వున్నా అభేదం ఊహింపరాదు. కవిత్వం లోని అనుభూతులతో, భావనలతో, కల్పనలలో మాత్రం కవికీ ఆత్మాశ్రయ కవిత్వానికీ అభేదాధ్యవసాయం చూడవచ్చును. పాశ్చాత్యులు Subjective Poetry ని Lyrical Poetry కి పర్యాయంగా స్వీకరించారు. Song Lyric, Reflective Lyric, ode, Elegy, Sonnet, Lyrical Ballad, Dramatic Monologue, Dramatic Lyric మొదలైన బహుప్రక్రియలను ఆత్మాశ్రయ కవిత్వంలో చేర్చారు. నవ్యకవిత్వంలో ఆత్మాశ్రయ రీతికి అగ్రతాంబూలం లభించింది. గురజాడ, రాయప్రోలు, కృష్ణశాస్త్రి మున్నగువారు— కొంతవరకు విశ్వనాధవారూ-ఆత్మాశ్రయ కవులే.

### iii వస్తునవ్యత

నవ్యకవిత్వ లక్షణాలలో మూడవ లక్షణమిది. కట్టమంచి రామలింగారెడ్డి పరకు అచ్చమైన సాంఘికేతి వృత్తంతో సామాన్యజనుల జీవితాన్ని చిత్రించిన కావ్యాలు

1. 'పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వం' : భారతి రజతోత్సవ సంచిక : జనవరి 1949.

దాదాపు వెలువడలేదనే చెప్పాలి. క్రింది వర్ణాలకు చెందిన పాత్రలు నాయికానాయకులు కావడం నవ్యకవిత్వంలో వచ్చిన గొప్పమార్పు. కాపువారు, గొల్లవారు, పడవ నడిపే వారు, అస్పృశ్యులు కావ్యపాత్రలు కావడం, వారి బ్రతుకుతెరువులకు కవితా గౌరవం కలగడం—ఇంతకు మించిన వస్తునవ్యత మరేముంది ?

నవ్యకవితలో అంగవర్ణన ఇంచుమించుగా పరిత్యక్తమైంది. వక్షోజ జఘనాదుల వర్ణన పూర్తిగా విడువబడింది. భావప్రకటన సాధనాలు కాబట్టి కొందరు నవకవులు ముఖ నేత్రాదులను వర్ణించారు. అయినా అంగవర్ణనకన్న అంతరంగవర్ణనకే ప్రాధాన్యం ఇచ్చారు. అనుభూతి గాఢత్వాన్ని ప్రకటించడానికే తమ ఆలోచనాశక్తిని అధికంగా ఉపయోగించారు.

## iv. భావనవ్యత

ఇది నాల్గవ లక్షణం. కవిత్వానికి కావలసిన వస్తు భావ రచనలు మూడింటిలో భావం అగ్రేసరం. నవ్యకవులు ఊహల గారడీలు మానేసి భావనా బలాన్ని ఎక్కువగా ప్రదర్శించారు. అష్టాదశ వర్ణనల నిర్బంధాలకు తిలోదకాలిచ్చారు. ప్రాచీన కావ్యాల నుండి ఎరువుతెచ్చుకున్న కవి సమయాలను చాలావరకు ప్రక్కకు నెట్టారు. అవసరమని తోచినప్పుడు, ఔచిత్య భంగం లేనప్పుడు సరిక్రొత్త సమయాలను ప్రయోగించారు. ఊహించిన విషయంకంటె భావించిన అనుభవించిన, విషయాన్నే స్వీకరించారు. విన్న దానికంటే కనుగొన్నదానినే వర్ణించారు. కౌదమ తెమ్మెరను వర్ణించినా, "కొండవీటి పొగమబ్బుల"ను వర్ణించినా తమ భావనా చక్షువులతో దర్శించి చేసిన వర్ణనలే అవి. విన్న వియద్గంగలకు బదులుగా కన్నులార గన్న 'కిన్నెరసాను'లను కమనీయ భావనా బలంతో వర్ణించి కవితాసతికి క్రమభూషలు అలంకరించారు.

## v. శైలీనవ్యత

నవ్య కవిత్వ లక్షణాలలో శైలీసారళ్యం గణనీయమైంది. ఒక్క విశ్వనాథ వారి కొన్ని కావ్యాలలోని శైలితప్ప మిగిలిన ప్రముఖ నవ్య కవులైన గురజాడ, రాయప్రోలు, కృష్ణశాస్త్రి, బసవరాజు, నాయని, దువ్వూరి మున్నగు కవుల రచనలన్నీ వైదర్భీరీతిలో, సంస్కృతాంధ్ర సరళ పదాల సముచిత సమ్మేళనంతో అనేకులకు అర్థమయ్యే ధోరణిలో రచింపబడినాయి. వీటిలో మారుమూల పదాలు మచ్చుకైనాలేవు.

## vi పదప్రయోగ నవ్యత

నవ్యకవులు వ్యవహారం నుంచి తొలగిపోయిన పదాలను విసర్జించారు. ఉదాహరణకు 'కంపు'. ఈ శబ్దానికి పరిమళం అనే అర్థం వుంది. తిక్కన నన్నెచోడుడు 'పువ్వుల కంపు' అని ప్రయోగించారు. రాయలు "పణ్యారంపు పుణ్యపు కంపు" అన్నాడు. ఈ శబ్దం పూర్వార్థం నుండి విడివడి ఈనాడు దురర్థాన్ని ఇస్తున్నది. ఇలాంటి వాటిని నవ్య కవులు బొత్తిగా వదిలివేశారు. ఇది ఒక నవ్యత. రెండవది- ప్రాచీనులు పాదపూరణం కోసం వాడిన పదాలను వీరు తిరస్కరించడం మానుగా, ఒనరన్, ధరలో మొదలైన వ్యర్థ పదాలను (ప్రకరణాన్ని బట్టి) వీరు ప్రయోగించడం మానుకున్నారు. అక్కిరాజు ఉమాకాంత పండితులు తమ "నేటి కాలపు తెలుగు కవిత్వము" అనే గ్రంథంలో పాదపూరణ పదాలను వింగడించి, దండగ్గణం, గుంపు గణం, ప్రకాశగణం మున్నగు పేర్లుపెట్టారు. నవ్యకవిత్వంలో గుంపు గణానికి చెందిన ఆళి, ఆవళి, చయం మొదలైన వ్యర్థపదాలున్నాయని వీరు విమర్శించారు. ఇందులో కొంత సత్యం లేకపోలేదు. అయినా తదితర వ్యర్థ పదాల గుంపులను నవ్యకవులు పరిత్యజించడం ప్రశంసావహం.

సమకాలిక సమాజంలో చలామణిలో వున్న పదాలకు పట్టం కట్టడం మూడవ నవ్యత. ప్రాచీన శతకాలలో అంతా, చేసే మున్నగు వ్యావహారిక పదప్రయోగాలు క్వచిత్తుగా కనిపిస్తాయి. ఇరవయ్యో శతాబ్ది తొలిప్రొద్దువరకు అప్పకవీయ ధాటికి తట్టుకున్న కవులు లేరు. గిడుగుపిడుగు హుంకృతితో గురజాడ చూపెట్టిన సరిక్రొత్త జాడతో వ్యవహారంలో ఉన్న పదాలకు, కావ్య ప్రవేశయోగ్యత కలిగింది. గురజాడ వారి ముత్యాల సరాలలో ఎన్నో శిష్ట వ్యావహారిక భాషాపదాలు చోటు చేసుకున్నాయి. నండూరివారి యెంకిపాటల్లో తూర్పు గోదావరి మండలంలోని కాపువారి వాడుకభాష రాజ్ఞీత్వం వహించింది. మాటకు కైతకు సాన్నిహిత్యం ఏర్పడడంకంటె సాహస ప్రయోగమేముంది? సాదురేఫకు, శకటరేఫకు యతిమైత్రి చేసినంతమాత్రాన పుట్టి మునిగిపోయినట్లు బొబ్బపెట్టిన తెలుగు భాషలో పాటక జనుల యాస మాటలకు పట్టం కట్టడం కంటె నవ్యత యేముంటుంది.

## vii దేశికవిత

నవ్య కవిత్వానికి మరోలక్షణం దేశికవితకు దేవిడీ లభించడం. మాత్రాచ్ఛందస్సులో మహనీయ భావాలను వెల్లడించ వచ్చనీ, దేశికవితలో అన్ని రసాలూ నిర్వహించవచ్చనీ నిరూపించారు గురజాడవారు. క్రమంగా రాయప్రోలు, బసవరాజు, విశ్వ

నాథ. కృష్ణశాస్త్రి, నండూరి — తర్వాతి కాలంలో శ్రీశ్రీ మున్నగు కవులు దేశిమార్గంలో రసవత్తర కావ్యాలూ, గీతాలూ రచించి నవ్యతకు శ్రీకారం చుట్టారు.

### viii ప్రక్రియా బాహుళ్యం

నవ్య కవిత్వానికి ప్రత్యేకలక్షణం ప్రక్రియా బాహుళ్యం. ఒక్క భావకవిత్వ శాఖనే తీసుకుంటే ప్రకృతి కవిత్వం, ప్రణయకవిత్వం, పల్లీజన కవిత్వం (Pastoral poetry). దేశభక్తి కవిత్వం, సంఘసంస్కరణ కవిత్వం, స్మృతిగీతాలు (Elegies), బాలగేయాలు మున్నగు అనేక ప్రక్రియలు భాసిస్తాయి. ఇంతటి ప్రక్రియా బాహుళ్యం ప్రాచీన కవిత్వంలో కనిపించదనే చెప్పాలి

## నవ్య కవిత్వ యుగకర్త

ఎవరు తమ రచనల ద్వారా వర్తమాన కాలానికే కాక భవిష్యత్తరాలకు కూడా అభినవోత్తేజం కలిగిస్తారో. ఎవరు గతాను గతికమైన ఘనీభవించిన ఆలోచనా ప్రపంచంలో ఉద్దామమైన ఉద్దీపనం కలిగిస్తారో, ఎవరు తమ తరువాత అనేక కవులకు అనుకరణీయులవుతారో వారిని సాహిత్యరంగంలో యుగకర్తలనవచ్చును. ఈ దృష్టితో చూస్తే కందుకూరివారే నవ్యసాహిత్యానికి మొదటి యుగకర్తలు. కేవలం కవితారంగం దృష్ట్యా పరిశీలిస్తే ఎవరు యుగకర్తలన్నది ప్రస్తుత చర్చనీయాంశం. కట్టమంచివారి 'ముసలమ్మ మరణము'తో తొలి ఉషోరేఖలు ప్రసరించినా, తరువాతితరం వారికవిత్వం చేత ఉత్తేజితం కాలేదు కాబట్టి వారిని కవిత్వరంగంలో యుగకర్తగా పరిగణించడానికి వీలులేదు. విమర్శనరంగంలోమాత్రం వారి 'కవిత్వతత్త్వ విచారము' నవయుగానికి నాంది పలికింది. తిరుపతి వేంకటేశ్వరకవులు ప్రాచీనధోరణికి ప్రచారం కలిగించారేకానీ భావవిప్లవానికి బాసటగా నిలువలేదు; కవితారంగంలో అపూర్వప్రయోగాలూచేయలేదు. ఇక మిగిలినవారు ఇద్దరు. గురజాడ అప్పారావుగారు, రాయప్రోలు సుబ్బారావుగార్లు. ఆ ఇరువురి విషయంలో నవ్యసాహిత్య విమర్శకులలో కొందరొకవైపు మరికొందరొక వైపు, ఇంకా కొందరు ఇరువురివైపు మొగ్గుచూపారు.

గురజాడ యుగకర్త అని సమర్థించినవారిలో ఆంధ్ర శేషగిరిరావుగారు, విశ్వనాథ సత్యనారాయణగారు, ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, నోరి నరసింహశాస్త్రిగార్లు, శ్రీశ్రీగారు ముఖ్యులు. రాయప్రోలు యుగకర్త అన్నవారిలో తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రిగారు, రమాకాంతాచార్యులుగారు, కురుగంటి సీతారామ్యగారు ముఖ్యులు. రాయప్రోలు గురజాడలు ఉభయులూ యుగకర్తలని సమన్వయవాదాన్ని ప్రతిపాదించిన

వారిలో పి. వి. రాజమన్నారుగారు, గిడుగు సీతాపతిగారు, కొత్తపల్లి వీరభద్రరావుగారు ముఖ్యులు.

## ఇద్దరూ యుగకర్తలే

రచనలోని నవ్యత, గ్రంథప్రచురణ, తరువాతి కవులపై ప్రభావం అనే మూడంశాలనుబట్టి పరిశీలిస్తే నవ్యకవిత్వ మహోదయానికి గురజాడ రాయప్రోలులు ఏకకాలంలో అరుణోదయ తపనోదయాలవంటివారని తేలుతుంది. డా॥ వీరభద్రరావు గారు సూచించినట్లుగా ఈ ఇరువురి మార్గదేశి కవిత్వాలకు భావకవిత్వ యుగంలో అనుయాయులు ఏర్పడ్డారు. అభ్యుదయ కవిత్వ యుగంలోమాత్రం శ్రీశ్రీ అవతరణతో గురజాడ ఆధిక్యం మరింత పెరిగింది. ఇంగ్లీషు భాషలో కాల్పనికోద్యమానికి (Romanticism) ఆచార్యులెవరు అనే ప్రశ్న వచ్చినప్పుడు స్ఫురించేది ఒకరు వర్డ్సువర్తు; రెండవవారు కాలరిడ్జి. వీరి Lyrical Ballads అనే గేయ సంపుటి ఆంగ్ల సారస్వతంలో కాల్పనికోద్యమానికి క్రొత్తదారులు తీసింది. అలాగే రాయప్రోలు గుర జాడల కావ్యాలు కూడా నవ్యకవిత్వయుగానికి నాందీ ప్రస్తావన లైనవి. అందుకే ఈ ఇద్దరినీ యుగకర్తలుగా భావించి కైమోడ్పులు ఘటించడం సమంజసం. గురజాడ రాయప్రోలుల పైన ఇంగ్లీషు Romanticism ప్రభావం కొంత వున్నది. తరువాతి భావకవులపై ఈ ప్రభావం కంఠదఘ్నంగా ప్రసరించింది. గురజాడవారికి వర్డ్సువర్తు అభిమానకవి. వర్డ్సువర్తు సామాన్య ప్రజల జీవితాలను కావ్యవస్తువులుగా మలచుకోవ డంతో ముగ్ధులై గురజాడవారు కూడా ఆ పద్ధతి నవలంబించి రచనలు చేశారు. ఇక రాయప్రోలు వారి ప్రణయ కవిత్వానికీ, కథన కవిత్వానికీ, ప్రకృతి కవిత్వానికీ ఇంగ్లీషు రొమాంటిక్ కవులే పథదర్శకులు. ఇక ఈ ఇరువురు యుగకర్తలపై ప్రభా వంవేసిన ఆంగ్ల కవిత్వం లోని Romanticism లక్షణాలను స్థూలంగా సూచించడం సముచితమని భావిస్తున్నాను.

## కాల్పనిక కవిత్వం-విశిష్ట లక్షణాలు

ఇంగ్లీషు కవిత్వ చరిత్రలో కాల్పనిక కవిత్వానికి విశిష్టస్థానం వుంది. చాసర్ తన కవిత్వాన్ని కథాకథనానికి సాధనంగా స్వీకరించాడు. స్పెన్సర్ దానిని దృశ్య చిత్రణకో అన్యాపదేశానికో ఉపయోగించాడు. ఎలిజబెత్ కాలం కవులకు కవిత్వం వివిధ మానసిక చర్యలకు, ఘట్టన ప్రతిఘట్టనాలకు వాహిక అయింది. కాల్పనిక కవులు అలాకాక కవిత్వానికి ప్రాణభూతమైన కల్పనకు (Imagination) అగ్రతాంబూలం ఇచ్చారు. సౌందర్యంతో అద్భుతత్వాన్ని రంగరించి చూపారు. నేపథ్యంలో నిలిచి

పోయిన ప్రకృతిని రంగస్థలం పైకి తెచ్చారు. సామాన్య వస్తువులకు మాన్యత కలిగించారు. అనాదృత విషయాలకు ఆసనం వేశారు. ప్రముఖ కాల్పనిక కవి బ్లేక్ పలికిన ఈ వాక్యాలలో కాల్పనిక కవితాతత్వం హృద్యంగా గబాళిస్తున్నది.

"To see a world in a grain of sand
A heaven in a wild flower
To hold infinity in the palm of the hand
And eternity in an hour".

ఈ కవిత్వానికి ప్రధాన గుణగుణాలు 1. ప్రకృతి ప్రీతి 2. గతవైభవ పునరుద్ధరణం 3. ప్రణయ తత్త్వం 4. ఆత్మాశ్రయత్వం 5. అద్భుతత్వం 6. సాహస ప్రియత్వం.

## i. ప్రకృతిప్రీతి

ప్రకృతికి భాష్య ప్రణేతలైన కవులలో వర్డ్స్‌వర్తు అగ్రేసరుడు. ప్రకృతిని సంప్రదాయ సిద్ధమైన దృష్టితో కాక భావనా రమ్యంగా పరిశీలించడంలో వర్డ్స్‌వర్తు అందె వేసిన చేయి. ఈయనకు ప్రకృతి కేవలం బాహ్యశోభా కలితమైందే కాదు: దివ్యత్వ నిధానం, విశ్వాత్మకూ, మానవాత్మకూ ప్రకృతియే స్వర్ణ సేతువని ఇతని విశ్వాసం. ప్రకృతిని ఇతడు భగవత్సాక్షాత్కారం (Apocalypse) గా స్వీకరించాడు. అంతే కాదు; మానవులలో సైతం ప్రకృతి స్వరూపాన్ని దర్శించిన చిన్మయుడీతడు. అందుకే వాల్టర్ రాలీ అనే విమర్శకుడు He saw men and women as trees walking" అని చమత్కరించాడు.

## ii. గత వైభవ పునరుద్ధరణం (Revival of the past)

'పోప్' యుగంలో Gothicism (జర్మన్ శిల్పరీతి) Chivalry (సాహసం) విస్మృతి గర్భంలో విలీనమై ఉన్నాయి. కాల్పనిక యుగంలో మళ్లీ వీటికి వెలుగు పుంత లభించింది. స్పెన్సర్, షేక్స్పియర్, మిల్టన్ మొదలైన మహాకవులకు ఉద్బోధకమైన పురాణ గాథాలహరి ఆగస్టన్ యుగంలోని శాస్త్రబద్ధ హేతువాద ప్రచండ వాదానికి శుష్కమైపోగా, కాల్పనిక కవులు దానిని పునరుజ్జీవింప చేశారు. వర్డ్స్‌వర్తు, షెల్లీ, కీట్సు వంటి కవులు గ్రీక్ పురాణగాథల నుండి ఇతివృత్తాలు ఎన్నుకున్నారు. ఈ గతవైభవ పునరుద్ధరణ తత్త్వంతోనే క్రైస్తవ మతం మళ్లీ మందహాసం చేసింది. కాల్పనిక కవులు గతాన్నీ మతాన్నీ తృణీకరింపలేదు. గతంలోని ఛాందసాలను పరిహరించి క్రైస్తవ మతంలోని మంచి లక్షణాలను స్వీకరించి తమదైన ఒక సిద్ధాంతాన్ని నిర్మించుకున్నారు.

iii. ప్రణయతత్వం (Philosophy of love)

కాల్పనిక కవులలో షెల్లీ, కీట్సు, బర్న్సు మున్నగువారు ప్రణయ తత్వాన్ని రసవత్తరంగా ప్రతిపాదించిన కవులు. వీరు దర్శించిన కాల్పనిక ఆదర్శవాదానికి (Romantic Idealism) ప్లేటో తత్వం (Platonism) మూలం. స్త్రీ పురుషుల ఆత్మలు మొదట అఖండంగా ఏకంగా ఉండేవనీ, ఆ అఖండాత్మయే రెండుగా విడిపోయి స్త్రీ పురుషులుగా రూపొందిందని, స్త్రీ పురుషులు ప్రణయ సూత్రంలో ముడివడి పోయి నప్పుడు ఆ ఖండాత్మలకు ఏకీకరణం జరుగుతుందని ప్లేటో ప్రతిపాదించిన సిద్ధాంత సారం. ఈ తత్వాన్నే కాల్పనిక కవులు ప్రతిపాదించారు. షెల్లీ ప్రేయసిని 'Spirit's sister' అని సంబోధించడంలో ఈ తత్వమే ఆవిష్కృతమైంది. ఈ ఐక్యతత్వాన్ని 'Love's Philosophy' అనే గేయంలో చక్కగా చిత్రించాడు షెల్లీ.

"The fountains mingle with the river
And the rivers with the ocean,
The winds of heaven mix forever
With a sweet emotion;
Nothing in the world is single;
All things by a law divine
In one spirit meet and mingle
Why not I with Thine?"

ఇది కాల్పనిక కవుల ప్రణయ దృక్పథానికి మణిదర్పణం వంటి కవితా ఖండం.

కాల్పనిక కవులు స్త్రీని కామైక దృష్టితో చూడలేదు. ఆరాధ్య దేవతగా స్వీకరించారు. మానవులను పునీతులనుగా చేసి వారికి దివ్యత్వాన్ని సమకూర్చగల శక్తి ప్రణయానికున్నదని విశ్వసించారు. అయితే కేవలం "స్త్రీ పుంసంయోగం"లోనే వీరు ప్రణయాన్ని దర్శించ లేదు. ప్రధానంగా వీరు వియోగ శృంగారాన్నీ, విషాద మాధుర్యాన్నే చిత్రించారు. "Our sweetest songs are those that tell of saddest thought" అన్న మాటలలో ఈ విషాద మాధుర్యాన్నే షెల్లీ ప్రతిపాదించాడు.

iv. ఆత్మాశ్రయత్వం

ఈ అంశం ఇంతకు ముందే స్పృశింప బడింది.

### v. అద్భుతత్వం :

Romance అనే శబ్దాని కర్థం అద్భుతం. బిగుసుకునిపోయిన జీవితాలలోని నిష్ఠుర సత్యాల నుండి విముక్తి పొందాలనీ, ఎక్కడికో ఏ గంధర్వ సీమాంచలాలలోకో రెక్కలు కట్టుకొని ఎగిసి పోవాలనీ కాల్పనిక కవులు కాంక్షించారు. అందుకే వర్డ్సువర్తు సహజత్వంతో కూడిన రచనలు చేసిన కాలంలోనే కాలరిడ్జి అద్భుతత్వాన్ని ప్రతిపాదించే రచనలను సృష్టించారు. ఇతని 'Ancient Mariner' అనే కావ్యం ఈ రసానికి చక్కని నిదర్శనం. అందువల్లనే వాట్స్‌డంటన్ (Wats Duntan) కాల్పనిక కవిత్వాన్ని విస్మయ పునరుద్ధరణం (Renaissance of wonder) అన్నాడు.

### vi. సాహస ప్రియత్వం (స్వేచ్ఛాకాంక్ష)

ఐతిహాసిక యుగంలో అనాదృతంగా ఉండిపోయిన ఈ వీరగాథలు (Ballads) కాల్పనికోద్యమ ప్రభావంతో పునరుద్ధరింప బడినాయి. ఈగాథలను చదివిన కాల్పనిక కవులలో సాహస ప్రియత్వం సటలు విదలించింది. బైరన్ కవిత ఈ రీతికి బలమైన నిదర్శనం. Child Harolde's Pilgrimage, Isles of Greece మొదలైన రచనలు బైరన్ సాహస ప్రియత్వానికి సంకేతాలైన కృతులు. ఇతని 'Prisoner of Chillon' లో స్వాతంత్ర్యేచ్ఛ ములుసూపింది. షెల్లీ రచించిన Prometheus unbound, ode to the west wind, skylark మున్నగు రచనల్లో స్వాతంత్ర్యపిపాస స్ఫుటంగా భాసించింది.

కాల్పనిక కవులు ఛందస్సులో గూడా గణనీయమైన మార్పు తెచ్చారు. ఐతిహాసిక యుగంలో closed couplet కున్న అగ్రేసరత్వాన్ని వీరు తృణీకరించారు. Blank verse ను పునరుద్ధరించారు. ఛందో వైవిధ్యాన్ని ఆదరించారు. శైలీ ప్రాధాన్యాన్ని త్రోసివేశారు. భాషా సారళ్యానికీ, సొంపైన నుడికారానికీ అగ్రతాంబూలం ఇచ్చారు. జుగుప్సను కలిగించే వస్తువులలో కూడా రమ్యతనే దర్శించారు. మానవత్వ దృక్పథాన్ని ప్రవేశ పెట్టారు. కవిత్వాన్ని సౌందర్యావతారంగా సంభావించారు. సౌందర్యమే సత్యమనీ, సత్యమే సౌందర్యమనీ భావించారు. ఈ విధంగా కాల్పనిక కవిత్వం అత్యంత వైవిధ్య విలసితం. అయినా వీరు భిన్నతలో ఏకతను సాధించారు. నవ్యతా ప్రీతియే ఆ ఏకత. కాల్పనిక కవులందరూ ఈ నవ్యతను ఉపాసించిన వారు. వారు నవ్యతాగవేషకులు కాబట్టే ఒకరి దానిని ఇంకొకరు గ్రుడ్డిగా అనుసరించలేదు. ఒక్కొకరు ఒక్కొక్క తత్వాన్ని నిర్దేశించడంలో మిన్నలనిపించు కున్నారు. అదు విషయ వర్ణనలో కాలరెడ్జి, నిసర్గరామణీయక చిత్రణలో వర్డ్సువర్తు, స్వాతంత్ర్యేచ్ఛ

బైరన్, సౌందర్యార్చనలో కీట్సు,మానవతా వాదంలో షెల్లీ, పల్లీయుల బ్రతుకులను బొమ్మకట్టి చూపడంలో బర్న్సు ప్రత్యేక ప్రతిభను ప్రదర్శించారు. ఇందరి గొంతుల నుండి వెలువడిన రసరాగాలు రాయప్రోలు, కృష్ణశాస్త్రి, నాయని, వేదుల, మల్లవరపు మున్నగు భావకవులను ఏ విధంగా స్పందింప జేశాయో ముందు ముందు చర్చిస్తాము.

# గురజాడ అప్పారావు

## ఇద్దరు యుగకర్తలు

గురజాడ అప్పారావుగారి జననం (30 నవంబరు 1861). ఆంధ్ర సాహిత్య లోకానికి అరుణోదయం. పిల్ల వసుచరిత్రల పెంజీకట్లు ముసురుకున్న రోజులలో దేశ కవితారశ్మిని ప్రసరించిన కవిభాస్కరుడాతడు. సాహిత్యం ఏ కొందరి సొత్తో అను కుంటున్న కాలంలో అది ప్రజల సొమ్మని ఉదారంగా పంచిపెట్టిన సౌమ్యశీలి ఆయన. కందుకూరి సాంఘిక విప్లవాన్నీ, గిడుగు భాషా విప్లవాన్నీ తనలో సమన్వయించుకొని సరిక్రొత్త సాహిత్య విప్లవాన్ని లేవనెత్తిన నవయుగవైతాళికుడతడు. అతని చేతి చలువతో అస్పృశ్యంగా పడివున్న వాడుక భాష అందలమెక్కింది. మెత్తని తెలుగు పలుకు కత్తివాదరలా మెరిసింది. వీధి మానిసికి వేదిక లభించింది. ఆంధ్ర భారతి అంతకు ముందటి అలంకార భారాలను డుల్చివేసి ముచ్చటగా ముత్యాల సరాలను అలంకరించుకుంది. నాటకం, గేయం, వ్యాసం, కథానిక ఆయన వాఙ్మహిమతో ఎన్నడూ లేని జవాన్నీ, జీవాన్నీ పుంజుకున్నాయి.

1882 లోనే—అనగా తమ ఇరవై ఒకటోయేటనే—గురజాడవారు ఇంగ్లీషులో కవితారచన ప్రారంభించారు. ఆ యేడు వారు వ్రాసిన 'సారంగధర' అనే శీర్షికతో వున్న ఇంగ్లీషు పద్యాలను మొదట గుండుకుర్తి వెంకటరమణయ్యగారు తమ 'ఇండియన్ లీజర్ అవర్' అనే పత్రికలో ప్రకటించారు. తరువాత వారే వాటిని 'రీస్ అండ్ రయత్' పత్రికా సంపాదకులునూ, ప్రముఖ విద్యావేత్తలునూ అయిన శంభుచంద్ర ముఖర్జీ గారికి ప్రచురణార్థం పంపించారు. ఆ పద్యాలను చదివి మెచ్చుకొని ముఖర్జీగారు అప్పారావు గారికి కవిత్వాశయాలను గూర్చి క్రొత్త దృక్పథాలను బోధించారు. వాటి ప్రభావం గురజాడ వారిపై ప్రసరించింది.

1889 నుండి 1915 వరకు గురజాడవారి మనోరంగంలో సాహిత్యం పట్ల సరిక్రొత్త ఆశయాలు క్రమపరిణామాన్ని పొందినవి. వారి ప్రాథమిక రచనలు కేవలం సాంప్రదాయిక రీతిలో పాతవృత్తాలలో రచింపబడిన ఖండకావ్యాలు. నాటిల మబ్బులు

పుష్పలావికలు, మెరుపులు, ఋతశతకం-ఖండకృతులు. 'సుభద్ర' సుదీర్ఘ కావ్యం. మాటల మబ్బులు అనే ఖండికలో విజయనగరంలోని అధికారులను అధిక్షేపించిన పద్యాలున్నాయి. దబ్బరలు, కొండెములు, మాయమాటలు, మొండితనం అధికారుల అబ్బురపు విద్యలని గురజాడవారు ఈ పద్యాలలో ఎత్తి పొడిచారు. పుష్పలావికలు అనేది తొమ్మిది పద్యాల చిన్నకృతి. ఇవి పుష్పలావికల శృంగారాన్ని ప్రదర్శించే ప్రబంధవర్ణనకు తీసిన నకళ్ళు. ఆముక్తమాల్యదలోని పుష్పలావికా వర్ణనల ప్రభావం ఈ పద్యాలలో అడుగడుగునా అగుపిస్తున్నది. 'మెరుపులు' అనే శీర్షికతో వ్రాసిన పద్యాలన్నీ సంస్కృత చాటు శ్లోకాలకు అనువాదాలే. 'ఋతశతకము'లో 25 కంద పద్యాలున్నాయి. ఈ పద్యాలలో పదాల గజిబిజి యెక్కువ, ప్రసాదగుణం తక్కువ. 'సుభద్ర' కావ్యం అసంపూర్ణం. మూడాశ్వాసాలే వుంది. అర్జునుడు మౌనివేషంతో రైవతకాద్రికి రావడం, బలరాముడు ఆతనికి పరిచర్యలు చేయడానికి సుభద్రను నియోగించడం, యతి అందాన్ని చూచి సుభద్ర సమ్ముగ్ధ కావడం, మరులు చెలరేగడం, ఆమెను సత్యభామ ఓదార్చడం ఈ కావ్యంలో చిత్రింపబడినాయి. ఇది సంపూర్ణంగా ప్రబంధ లక్షణాలు పొదుగుకున్న కావ్యం. కానీ నవనవోన్మేష ప్రజ్ఞగల గురజాడవారికి ఈ కృతులు తృప్తి కలిగించలేదు. కొత్తదారి వేయాలనే కుతూహలం ఉదయించింది. ఆయన దృష్టి భవిష్యత్తులోకి చొచ్చుకొని ఎగిసిపోయేటంతటి విశితమైనది, ప్రగతి మూలకమైనది. అందువల్లనే ఆయన వినూత్న ప్రయోగాలకు కంకణం కట్టుకున్నారు. వృత్తరచనకు స్వస్తి చెప్పారు. ప్రబంధరీతులకు తిలోదకాలిచ్చారు. వాడుక భాషతో చేతులు కలిపారు. ఆంగ్లసాహిత్యంలోని విమర్శ గ్రంథాలూ, కావ్యాలూ గురజాడ వారిలో నిద్రాణమైవున్న ప్రతిభా బీజాలను జాగృతం చేసినవి. ఫలితం 1893 లో కన్యాశుల్క నాటకరచన. తరువాత పదిహేడేండ్లకు ముత్యాల సరాల సృజన.

## 'కన్యాశుల్క' రచన

ఆంధ్ర నాటకరంగంలో 'కన్యాశుల్కం' గొప్ప ప్రయోగం. ఇది వ్యావహారిక భాషకు పట్టం కట్టిన ప్రథమ దృశ్యకావ్యం. అంతకుముందే ప్రహసనాలలో కందుకూరి వారు వాడుక భాషను ప్రవేశపెట్టినా, అది పేశల హాస్యాన్ని సృష్టించడానికి మాత్రమే ఉద్దేశించ బడింది. సమాజంలోని అన్ని తరగతులకు చెందిన అభిప్రాయాలనూ, వారి కష్టసుఖాలనూ సజీవమైన వ్యావహారిక భాషలో రసపుష్టికి రవ్వంత కొరత కలగకుండా వ్యక్తం చేసిన ప్రప్రథమ నాటకం కన్యాశుల్కమే. కావ్యగుణాలనూ, కావ్యప్రయోజ

నాలనూ నిర్ధరించేవి ప్రాచీన వైయాకరణుల ఛాందసాలు కావనీ, నాగరకతా సంపన్నంగా కావ్యభాషను పెంపొందించుకోవడానికి వ్యవహారం నుంచి తొలగిపోయిన పదాలను, తెనుగు జాతీయతకు విరుద్ధమైన సంస్కృత శబ్దాల రూపాలను త్రోసివేసి, భాషను సజీవమైన వాడుక భాషతో పుష్టిమంతం చేసుకోవలసి వున్నదనీ ఈ విధంగా కావ్య భాషకూ, వ్యావహారిక భాషకూ సాన్నిహిత్యం సంపాదింపవలసి వున్నదనీ అప్పారావు గారు ప్రథమ ముద్రణ పీఠికలో ఉద్ఘాటించారు. 1909 మే నెలలో వీరు రచించిన కన్యాశుల్క ద్వితీయ ముద్రణ పీఠికలో వ్యాహారిక భాషా ప్రాశస్త్యం, సంఘ సంస్కరణ, నాటకరచన, సమకాలిక విద్వాంసుల ఛాందస ధోరణులూ మున్నగు అనేక విషయాలను కూలంకషంగా చర్చించి తమ క్రొత్త సిద్ధాంతాన్ని బలపరిచారు. అత్యంత క్లిష్టసమస్యలున్న సమకాలీన జీవితాన్ని చిత్రించడానికి నాటకరచయితలు ప్రయత్నించక పోవడం పట్ల విచారం వెలిబుచ్చారు. మొత్తానికి ఈ నాటకంద్వారా అప్పారావుగారు వ్యావహారిక భాష కావ్యోపయోగి అని నిరూపించారు. వాస్తవికతకు నివాళులెత్తారు. సాంఘిక జీవన చిత్రణద్వారా నూత్న రీతులనుప్రదర్శించారు. ఈ విషయాలన్నీ వారి ముత్యాల సరాలకూ వర్తిస్తాయి.

## కవిత్వంలో నూత్న ప్రయోగాలు : ముత్యాల సరాలు

గురజాడవారు కవిత్వరంగంలో చేసిన సాహసప్రయోగాలు ప్రాచీన కవులలో పాలకురికి సోమనాథుని ప్రయోగాలను తలపింపజేస్తాయి. ఇద్దరూ దేశిసాహిత్య ప్రవర్తకులే. ఇద్దరూ తమ కాలంలో వ్యవహారంలో వున్న పదాలకూ, పలుకుబళ్ళకూ గ్రాంథికత కలిగించిన వారే. పాలకురికి జానుతెనుగును ప్రతిపాదించగా గురజాడ తెలుగు పలుకుబడికి ప్రాణం పోశాడు. ఉభయులూ వర్ణభేదం లేని సంఘవ్యవస్థను వాంఛించారు. ఛందస్సులో క్రొత్తమార్గాలు అనుసరించారు. "ఇరువురికీ కల భేదమంతా ఒక్క విషయంలో ఒకరిది శివభక్తి; మరొకరిది మానవాభ్యుదయాసక్తి" ఈ ప్రయోగాలన్నిటికీ కేంద్రబిందువు దేశిసాహిత్య పునరుద్ధరణ కాంక్ష.

కావ్యవస్తువు విషయంలో గురజాడపై వర్డ్స్వర్తు సిద్ధాంతాల ప్రభావం ప్రబలంగా వుంది. Lyrical Ballads ద్వితీయ ముద్రణ పీఠికలో వర్డ్స్వర్తు వెలిబుచ్చిన అభిప్రాయాలు ఈ సందర్భంలో గమనింవదగ్గవి.

"The pricipal object then, proposed in these poems was to choose incidents and situations from common life and to relate

cr describe then, throughout, as far as possible, in a selection of language really used by men and at the same time, to throw over them a certain colouring of imagination, whereby ordinary things should be presented to the mind in an unusual aspect."

ఈ సిద్ధాంతంలో గమనింపదగ్గ అంశాలివి. ఒకటి : కావ్యవస్తువును సామాన్యుల జీవిత సంఘటనలనుండి, పరిసరాలనుండి స్వీకరించడం. రెండవది : కావ్యభాష సాధ్యమైనంత వరకు ప్రజావ్యవహారానికి సన్నిహితంగా వుండడం. మూడవది: ప్రజలభాషను ఉన్నదున్నట్లుగాక భావనారంజితం చేసి ప్రకటించడం. ఈ మూడంశాలు క్రమంగా వస్తుభాషా (రచన) భావాలపట్ల వర్డ్సువర్తు అభిప్రాయాలను తెలియజేస్తాయి. అప్పారావుగారిపై ప్రభావం వేసిన అంశాలివే.

గురజాడవారు వ్యర్థపదాడంబరాన్ని నిరసించారు. "అలతి యలతి తునియల కాహళ సంధించిన" విధంగా పదాలు అమరవలెనన్న తిక్కన్న మాట దక్కించారు. చరణాలు దేనికవి తునిగిపోయేటట్లుగా రచన సాగించారు. ఈయన రచన అల్ప సమాసకమే కాదు. చాలావరకు అసమాసకం కూడా. వ్యావహారిక పదాలకు సమస్త భావ ప్రకటన సామర్థ్యం వున్నదనీ అది అన్ని విధాలా కావ్యోపయోగి అనీ నిరూపించారు.

"మెచ్చనంటా వీవు; నీవిక
మెచ్చకుంటే మించిపాయెను
కొయ్యబొమ్మలె మెచ్చు కళ్ళకు
కోమలుల సౌరెక్కడా."

విడివిడి మాటలే ప్రయోగించినా ఈ చరణాలలో అసికొసలలోని శక్తి దాగివుంది. దీనిలోని మాటలన్నీ వ్యవహారం లోనివే. దేశభక్తిగీతంలోని ప్రతి పంక్తిలో ఈ శక్తియే కనిపిస్తుంది. వాడుక మాటలే వాడుకున్నా ఆయన ఎక్కడా జారిపోలేదు. ప్రాచీన కవులలో తిక్కన్న, వేమన్న తెలుగు నుడిని తీర్చిదిద్దడంలో ఒజ్జబంతులు. వారి ఒరవడిలో నడచినా వారికి భిన్నమైన రీతిని కూడా సాధించాడు గురజాడ. అ మార్పు వాడుకపదాల కూర్పు. ఈ మార్పు కవికి కత్తిమీద సామువంటిది. ఇందులో లోక వ్యవహారాన్ని ఉన్నదున్నట్లు ప్రదర్శింపవలసి వుంటుంది. అనగా పర్యాయ పదాల గారడికి ఇందులో వీలులేదు. పదాల పటాటోపంతో భావదారిద్ర్యాన్ని కప్పిపుచ్చుకునే అవకాశం లేదు. ఏది చెప్పినా వాడిగా వేడిగా చెప్పవలసి వుంటుంది. సూటిగా గుండెల్లోకి

దింపవలసి వుంటుంది. గురజాడవారు వాడుక మాటలద్వారా ఇవన్నిటినీ సాధించారు. మామూలు వ్యావహారిక పదాలలో గ్రీకు గాథను (డామను, పిథియసు) పలికించారు. విశ్వమానవగీతం కాదగిన జాతీయగీతం (దేశభక్తి) రచించారు. పూర్ణమ్మ వంటి కరుణ రసాత్మకమైన గాథ ప్రవచించారు. లవణరాజు కలవంటి వివిధ రసభరితాలైన కథన కృతులు కల్పించారు. 'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్' వంటి మహా సూక్తులను ప్రవచించారు. ఒక్కమాటలో చెప్పాలంటే మట్టిని మాణిక్యంగా మార్చి యిచ్చారు.

గురజాడవారు వాడుక భాషను ప్రయోగించినంత మాత్రాన, దీర్ఘ సమాసాలనూ వ్యర్థపదాడంబరాన్నీ నిరసించినంత మాత్రాన వారికి సంవిధానంపై దృష్టిలేదని అనుకో రాదు. "చిత్రములు వ్రాయునప్పుడూ, జిలుగు చెక్కునప్పుడూ శిల్పకుడు ఎట్టి పరి శ్రమము చేసినగానీ కావ్యగుణము లబ్బనేరవని మా మతము" అని అప్పారావుగారే తమ వ్యాస చంద్రికలో వ్రాకుచ్చారు. వారి శిల్పదృష్టికి పూర్ణమ్మ, ముత్యాల సరాలు, లంగరెత్తుము వంటివి చక్కని నిదర్శనాలు.

"విరిగి పెరిగితి పెరిగి విరిగితి
కష్టసుఖములపారమెరిగితి
పండునన్నవి ఆశలెన్నో
యెండిరాలగ బొగిలితిన్"
"దేవతలతో జోడుకూడితి
రక్కసులతో కూడి ఆడితి
కొత్తమిన్కుల తెలివిపటిమను
మంచిచెడ్డల మార్చితిన్."
"పంజరంబున నున్నకట్లను
పగలదన్నకలేక స్రుక్కితి
నింగిపర్వగలేని జన్మము
నీరసంబని రోసితిన్."[1]

ఈ చరణాలలో భావానికి తగిన భాష, వాక్యశిల్పం మిరుమిట్లు గొలుపుతుంటాయి. ప్రాయికంగా గురజాడ వారి రచన సానలు తీరని జాతిరత్నం వంటిది. సమరభేరి విని

1. ముత్యాల సరాలు: లంగరెత్తుము

పించగానే సముల్లసిత చేతనులై బల్లెమో, బాకో, కత్తియో. కర్రయో-ఏవి చేతికి చిక్కితే అది తీసుకొని విజృంభించే యోధులను తలపించే రచన వారిది. అందువల్ల శిల్పదృష్టితో చూస్తే కొన్ని పంక్తులు నిలవవు. అంత మాత్రాన వారికి శిల్పదృష్టి లేదని కాదు. పైన పేర్కొన్న చరణాలలో వారి శబ్దార్థ శిల్పం జిలుగు వన్నెలతో సాక్షాత్కరిస్తుంది. ఊహలతో కసరత్తులు చేయించడం కృత్రిమ పద చిత్రాలు సృష్టించడం గురజాడకు చుక్కెదురు. కవిత్వంలో వాస్తవికతను ప్రవేశ పెట్టిన కవి ఆతడు. వాస్తవికత అంటే నీరసమైన భావ ప్రదర్శనమని అనుకోకూడదు. ఆయనది వట్టి ఫోటోగ్రఫీ కాదు. శ్రీశ్రీ అన్నట్టుగా "ఎక్స్‌రే ఫోటోగ్రఫీ" అది కూడా ప్రధానంగా హృదయ సంబంధి. అందువల్లనే ఆయన చిత్రించిన పాత్రలు, చేసిన వర్ణనలు, కల్పించిన వాతావరణం మన కళ్ళయెదుట జరిగినట్లే అనిపిస్తాయి. వర్డ్సువర్తు చెప్పినట్లుగా ఈయన colouring of the imagination" తో కూడుకున్న స్వాభావిక వర్ణనలు చేసిన కవి

## ముత్యాల సరాలు-ఛందస్సు

గురజాడవారు చేసిన అత్యంత విసూత్న ప్రయోగాలలో ముత్యాలసరం ఒకటి. పద్యం నుంచి గేయానికి తిరిగిపోవడమే గొప్ప ప్రయోగం అందులోనూ ఒక్క-మాత్రా నియమం తప్ప యతిప్రాసల నియమం లేని గేయాన్ని చేపట్టడం. పైగా వాడుకమాటలు పత్రియోగించడం, ఆ గేయాన్ని ఉబుసుపోకకు కాకుండా ఉదాత్త విషయాలను భావ బంధురంగా వ్యక్తీకరించడానికి సాధనంగా చేయడం-ఒకదానికంటె ఒకటి అపూర్వ ప్రయోగాలు. ముత్యాలసరాల సంపుటిలో ఒక్క పూర్ణమ్మ మాత్రం భిన్న చ్ఛందస్సులో వుంది. ఇది నాలుగుమాత్రల గణాలతో నడిచే చతురస్రగతిలో వుంది. మిగిలిన గేయాలన్నీ ఏడుమాత్రల గణాలతో సాగిపోయే మిశ్రగతిలో చేరుతాయి ఈ గతిలో వ్రాసిన గీతాన్నే ముత్యాల సరమని గురజాడవారు ఏ శుభముహూర్తంలో నామకరణం చేశారో గానీ అప్పటికీ ఇప్పటికీ అందరూ దీనిని ముత్యాలసరమనే అంటున్నారు

తెలుగు ముత్యాల కోనవలె ముద్దులొలికే తీపిగల భాష. తెలుగు పలుకులు ముత్యాల వంటివి. ముత్తెం రూపంలో చిన్నది; తేటదనం ఉన్నది. గురజాడ కవిత కూడా చిన్న చిన్న తేటమాటల కూర్పే. తాను తెలుగు పలుకుబడికి ప్రాధాన్యమిచ్చి తెలుగుదేశీ చ్ఛందస్సులో కవిత్వం వ్రాస్తున్నాడు కాబట్టి మిశ్రగతిలో నడిచే ఛందస్సుకు తన అభిరుచికి అనుగుణంగా ముత్యాలసరాలు అని పేరుపెట్టుకొని వుంటాడు గురజాడ.

ముత్యాలసరంలో నాలుగు పాదాలుంటాయి. మొదటి మూడుపాదాలలో 3+4 3+4=14 మాత్రలుంటాయి. నాల్గవపాదంలో 7 మొదలుకొని 14 వరకుంటాయి. గురజాడ చేసుకొన్న నియమమిది. నడకను బట్టి ముత్యాలసరం మిశ్రగతిలో వున్న వృషభగతి రగడకూ ఆ ఛందస్సులోనే నడిచే కొన్ని జానపదగేయాల వరుసలకూ సరి పోతుంది. అయితే దీనిలో వాటిలో లేని ప్రత్యేకత కూడా వుంది. వృషభగతి రగడలో అంత్యప్రాస నియమముంది. ఈ గతిలోనే నడిచే "గుమ్మడేడే" వంటి పాటలలో ప్రాస నియమమూ యతినియమమూ ఉంది. పైగా వీటిలో నాల్గవపాదం 9 మాత్రలతో మాత్రమే ముగుస్తుంది. గురజాడవారు ఈ విషయంలో స్వేచ్ఛ నవలంబించారు. యతిప్రాసల నియమాన్ని ఉద్దేశ పూర్వకంగా ఉల్లంఘించారు. అక్కడక్కడ దొరలిన యతిప్రాసలు అనుకోకుండా వచ్చిపడినవే కానీ ఆదేపనిగా కూర్చినవి కావు. అంతేకాక పాదాలు తుంచ డంలోనూ, పాదసంఖ్యా నియతిలోనూ, వాడుకభాషను ఆ ఛందస్సులో పొదగడం లోనూ, ఎప్పటి కప్పుడు క్రొత్తప్రయోగాలు చేసి సత్ఫలితాలు సాధించారు. "నా ముత్యాల సరాల గేయములను క్రమానుగతంగా మీరు పరిశీలించినట్లయితే ఒకదానిలో కంటె ఇంకొకదానిలో నేను సాధించిన అభివృద్ధి మీకు స్పష్టపడుతుందని వారు 1912 లో గున్నయ్య శాస్త్రిగారికి వ్రాసిన లేఖలో అన్నారు. మొత్తానికి ముత్యాలసరాల ఛంద స్సులో ముక్కోటి తెలుగుల కష్టసుఖాలను గానంచేసిన కవి గురజాడ. గురజాడపై ఇద్దరు మహాకవుల ప్రభావం ఉంది. ఒకరు వర్డ్సువర్తు; రెండవవారు రవీంద్రుడు. ఈ ఇద్దరిని గూర్చి గురజాడవారు ప్రశంసాపూర్వకంగా వ్యాసాలు వ్రాశారు. రవీంద్రునితో ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా జరిపారు. అయితే వర్డ్సువర్తు కవితా ప్రభావం ఈ కవిపై ప్రసరించినట్లు రవీంద్రుని రచనల ప్రభావం పడలేదు. రవీంద్రుని వ్యక్తిత్వవిశిష్టత మాత్రం వీరిని విశేషంగా ఆకర్షించింది.

## మానవతావాద ప్రభావం

మానవతావాదం (Humanism) పాశ్చాత్యలోకంలో రాచరికం, ఫ్యూడలిజం నశించిపోయిన పిమ్మట ఉద్భవించిన ఉద్యమం. ఈ ఉద్యమం సామాన్యునికి సార్వ భౌమత్వాన్ని ప్రసాదించింది. కులమత భేదాలను కూకటివేళ్ళతో పెళ్ళగించడానికి యత్నించే వ్యక్తిస్వేచ్ఛను బలపరిచింది. శాస్త్రీయ దృక్పథాన్ని పెంపొందించింది. వాస్తవికతకు నీరాజనం పట్టింది. గురజాడవారి కన్యాశుల్కంలో ఈ మానవతావాదమే

తొంగిచూస్తుంది. ముత్యాల సరాలలోని "మనిషి" అనేగేయం మానవతా వాదానికి ప్రతినిధి రచన. మనిషిచేసిన రాయిరప్పకు మహిమ కలదని మొక్కుతూ మనుషులనే రాయిరప్పల కంటె కనిష్టంగా చూసేవారిని ఈ గేయంలో వారు నిరసించారు.దేవుడుఎక్కడో కొండకోనలలో లేడని జ్ఞాననేత్రం విప్పిచూస్తే మానవమాత్రుని లోనే వున్నాడని ప్రబోధించారు. ఇది మానవతా వాదానికి సంబంధించిన దృక్పథమే.

మానవతా వాదంలో గర్భితమై వున్న మరో అంశం సంఘ సంస్కరణాభిలాష. వీరి గేయాలలో అనేక సందర్భాలలో సంఘసంస్కరణ దృష్టి వజ్రధారాధాళధళ్యాన్ని వెలారుస్తున్నది. ముత్యాలసరాలలోని మొదటిగేయమే-తోకచుక్క పొడవడం వల్ల అనర్థం సంభవిస్తుందనే మూఢ విశ్వాసాన్ని ఖండించడానికి వ్రాసింది. గాంధీజీ హరిజనోద్యమం ప్రారంభించకముందే గురజాడవారు "లవణరాజు" కలలో

"మలినదేహుల మాలలనుచును
మలినచిత్తుల కధికకులముల
నెలవొసంగిన వర్ణధర్మమ ధర్మధర్మంబే"

అని, మాలఅనే భేదం కులాన్నిబట్టి కాక మనస్సును బట్టి కలగాలని ప్రతిపాదించి ప్రాచీన వర్ణవ్యవస్థను ఖండించారు.

"మంచిచెడ్డలు మనుజులందున
ఎంచిచూడగ రెండె కులములు
మంచియన్నది మాలయైతే మాలనే అగుదున్

అని హరిజన సమస్యకు, అస్పృశ్యతా సమస్యకు అలనాడే కావ్యత్వాన్ని కలిగించారు.

## ప్రేమతత్వం

గురజాడ ప్రతిపాదించిన ప్రేమ రెండు విధాలుగా వుంది

1. పవిత్ర దాంపత్య రక్తి 2. విశ్వమానవ ప్రేమ. ఈ రెంటినీ తన కవిత్వం ద్వారా నిరూపించాడతడు. 'కాసులు' అనే గేయం పవిత్ర దాంపత్య రక్తిని ప్రతిపాదించిన రచన. "ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును; ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచు"నని దీనిలో ప్రవచించారు. కామం వయసుతోనే చల్లారుతుందని అచ్ఛమైన ప్రేమ ఒక్కటే దంపతుల పాలిటి రాజమార్గమనీ తద్వారా వారు జీవితాన్ని సుఖమయంగా సాగించవచ్చుననీ ప్రకటించారు. ఈవిధంగా వారు పవిత్రమైన దంపతీప్రేమకు పట్టాభిషేకం చేశారు. ఇక రెండవది విశ్వమానవ ప్రేమ. తోటి మనిషిని మనసిచ్చి ప్రేమించడం కన్న ఘన

కార్యం లేదని వీరు భావించారు. క్రీస్తు ఏది బోధించెనని అనుకుంటున్నామో, షెల్లీ దేనిని కవితాసత్యమని కళావిలాసమని ప్రవచించాడో, గౌతమబుద్ధుడు దేనిని ఉత్తమఘంటాపథ మని మనకు ఉపదేశించాడో అదే నిజమైన ఉన్నత ప్రేమ అని వీరు అభిప్రాయపడ్డారు. అది మరేదో కాదు. విశ్వమానవ ప్రేమ. అందుకే వీరు మతాన్ని ఆరాధించడం కంటె మానవుణ్ని ప్రేమించడం గొప్ప అని చాటగలిగారు. ముత్యాల సరాలలోని మొదటి గేయం లోనే

"యెల్లలోకము వొక్కయిల్లై
వర్ణభేదములెల్ల కల్లై
వేల నెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియ"

అని ఉద్ఘాటించారు. 'దేశభక్తి' గేయంలో

''దేశమనియెడు దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్'' అని
''అన్నదమ్ములవలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్'' అని

విశ్వమానవప్రేమను గానం చేశారు.

## దేశభక్తి

గురజాడ వారిది ప్రాంతపుటెల్లలను, దేశసీమలను,జలధులను దాటిన విశాలదృష్టి. ఆయన దేశభక్తిలో అంతర్వాహిని విశ్వమానవ ప్రేమ.

"దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా!"......
"దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్!"......

అన్న పంక్తులలో ఈ మహత్తర సత్యమే ఇమిడి వున్నది. మనుషులను ప్రేమించడమే అచ్చమైన దేశభక్తి అని గురజాడవారి అభిప్రాయం.

గురజాడవారి 'దేశభక్తి' గేయం వంటిది భారత సాహిత్యంలోనే లేదని చెప్ప వచ్చును. బంకించంద్రుని 'వందేమాతరం', రవీంద్రుని 'జనగణమన', ఇక్బాల్

హిందూస్తాన్ హమారా' అనేవి గొప్ప జాతీయగేయాలు. అయితే వీటి ప్రధాన లక్ష్యం స్వదేశ సంకీర్తనం. సాధారణంగా ఏదేశపు జాతీయగీతమైనా ఈ ధోరణిలోనే వుంటుంది. గురజాడవారి గేయంలోని విశేషం ఏమిటంటే ఇది ఒకవైపు స్వదేశీయులలో జాతీయాభిమానాన్ని నూరిపోస్తూనే ఎల్లలు దాటి ఎగిసిపోయి సమస్తజాతులను, విశ్వ మానవ కోటిని పలకరిస్తున్నది. అందువల్లనే ఏ జాతీయగీతానికీ లేని విశిష్టత దీనికి అలవడింది.

## తదనంతర కవులపై ప్రభావం

గురజాడవారు యుగకర్తగా తరువాతివారికి అందించిపోయిన కవితా ప్రక్రియలివి.

1. ముత్యాల సరాలు (కొత్తఛందస్సు)
2. గేయంలో కథాకావ్యరచన (పూర్ణమ్మ.)
3. ఆత్మాశ్రయ కవిత్వరీతి

   "విరిగి పెరిగితి, పెరిగి విరిగితి" (లంగరెత్తుము) వంటి చరణాలు తరువాత తరువాత భావ కవితాయుగంలో ఆత్మాశ్రయ రీతిలో రచింపబడిన విషాద గీతాలకు మార్గదర్శక మైనవి. ఉదాహరణకు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'చుక్కలు' అనే గేయం.

4. ప్రబోధ కవిత్వం

   ప్రబోధ కవిత్వానికి గురజాడ వారే మార్గదర్శకులు 'దేశభక్తి', 'మనిషి' వంటివి ప్రబోధ గేయాలే. వీటి ప్రభావం తరువాతి నవ్యకవులపై విశేషంగా ప్రసరించింది.

5. సంఘ సంస్కరణ కవిత్వం

   వీరి ముత్యాల సరాల గేయం సంఘ సంస్కరణ కవిత్వానికి మేలు బంతి. ఈ ప్రక్రియ తరువాతి కాలంలో మంగిపూడి, రాయప్రోలు, జాషువా మున్నగు వారి చేతిలో సిద్ధి పొందింది.

6. ప్రణయ కవిత్వం

   సభ్యమైన ప్రణయ కవిత్వానికి వీరు పాదులు వేశారు. ఉదాహరణకు 'లవణరాజు కల'.

7. బాలగేయాలు

'మిణుగురులు' అనే పేర రెండు బాలగేయాలను వీరు రచించారు. ఇవి ప్రాచుర్యం పొందినవికాకున్నా బాలగేయరచనకు మార్గదర్శకాలని చెప్పవచ్చును.

ఈ విధంగా కవిత్వంలో అనేక నవ్య ప్రక్రియలకు గురజాడవారు మార్గదర్శకులైనారు. వీరి ముత్యాల సరాన్ని చేపట్టినవారిలో రాయప్రోలు, అబ్బూరి, దువ్వూరి, దేవులపల్లి, వేదుల, బసవరాజు, మల్లవరపు, పురిపండా, శ్రీశ్రీ మున్నగు ప్రసిద్ధ కవులున్నారంటే ఆ ఛందస్సుకు కలిగిన ప్రాచుర్యం వేరే చెప్ప నక్కర లేదు. కిళాంబి రంగాచార్యు లన్నట్లుగా 'ప్రజాసామాన్య రక్తధ్వజాన్ని' పైకెత్తిన కవీంద్రుడాతడు. "నాది ప్రజల ఉద్యమము. దానిని ఎవరిని సంతోష పెట్టడానికైనా వదులుకోలేను" అన్నంత వజ్ర సంకల్పంతో నవ్య సాహిత్య పథాలలో ప్రస్థానం చేసిన ప్రవక్త ఆయన.

## రాయప్రోలు సుబ్బారావు

క్షీణప్రబంధ యుగంలో వెర్రితలలు వేసిన రీతిప్రాధాన్యానికీ, శబ్దచిత్రలౌల్యానికీ, నిర్హేల శృంగారానికీ, నీరస సంప్రదాయ పాలనకూ విరుగుడుగా రసగుళికల వంటి రమ్యకావ్యాలను సృష్టించిన కవీంద్రులు రాయప్రోలు సుబ్బారావుగారు. వీరు గురజాడవారివలె ఒక్కుమ్మడిగా సంప్రదాయానికి ఎదురీదినవారుకారు; అంతమాత్రాన సంప్రదాయంలో పడి కొట్టుకుపోయిన వారూ కారు. తారుణ్యదశలో ఆశు కవితాప్రవాహంలో కొంత దూరం తేలిపోయినా త్వరలోనే తప్పు గమనించి ఏటికెదురీదాలని సంకల్పించి క్రమక్రమంగా ప్రవాహదిశనే మార్చివేసిన నవ్యకవిత్వయుగకర్తలు వీరు. దేవతలో రాజవంశీయులో కావ్యనాయికా నాయకులుగా ఉండడానికి అర్హులని అనుకుంటున్న కాలంలో వీరు సామాన్య మానవులను కావ్యపాత్రలుగా గ్రహించారు. ప్రకృతిఅంటే ప్రాచీన కావ్యాల ద్వారా దిగుమతి అయిన లవలీలుంగ లవంగ ప్రభృతి లతలు, చందన తమాల పనస ఖర్జూరాది వృక్షాలే అనే భావం ప్రబలిన రోజుల్లో; చిరునిమ్మ చెట్లతో, తాంబూల లతలతో, మధ్యాహ్న మల్లికలతో, కాశీరత్నాలతో, కందిచావులతో, అనాస మొక్కలతో, తులసితోటలతో, తాటాకు దడులతో, నీటుగులికే తెలుగునాటి పల్లీ పరిసరాలను, ప్రకృతి చిత్రాలను కావ్యప్రాంగణంలో ప్రవేశ పెట్టారు. 'వాణి వాయింప మ్రోగిన వీణ మీద పారశీక గీతములు" పలికించారు. ''ఋషుల నీవారములు" ఫలించిన పొలాలలో గులాబీలు పూయించారు. కచకుచవర్ణనలతో కకావికలైపోయిన కావ్యనాయికను సమాదరించి ఆమె అంతరంగంలోని అమృతాన్ని ఆవిష్క-

రించారు. భోగ్యవస్తువుగానూ, కేవల వర్జ్య వస్తువుగానూ పరిగణింప బడుతున్న 'స్త్రీ'ని దేవీ పీఠంపై అధివసింపజేశారు. ప్రకృతిని తల్లిగా దేవతామతల్లిగా సంభావించారు. లఘుకథా కావ్యరచనకు దారులుతీశారు. మార్గకవితామార్గంలో పయనిస్తూనే దేశికవితకు పతాకలెత్తారు. శృంగారం కరుణం రెండే కావ్య రసాలని సిద్ధాంతీకరిస్తూనే "కడుపులో నున్న కండలు కదలంగ" "కంగుల వీరకాసె కట్టి" రంగాన దూకిన జాతీయ వీరుల పౌరుష కీర్తనలను గానం చేశారు. హేయక్లీబ జుగుప్సాయుత వస్తువులకు కావ్యయోగ్యత లేదని అంటూనే పులివిస్తరాకు మీద లలిత రమ్య పద్యాలు విరచించారు. దాదాపు ఒక అర్ధ శతాబ్దం పాటు లఘుకథాకావ్యం, ఖండ కవిత, గేయ కవిత, ప్రేమగాథ, ప్రబోధ కవిత, సంఘ సంస్కరణ కవిత, స్మృతికావ్యం, ప్రకృతి కవిత్వం, పల్లీయ కవిత్వం, అభ్యుదయగీతం మున్నగు బహుప్రక్రియలలో ధారావాహికంగా కవితా మధువును అందించారు. భావకవిత్వానికి భాష్యాలనదగిన సిద్ధాంత కృతులు రచించారు. ఆచార్య శంకరులకూ, రవీంద్రునికీ, ఖయ్యాముకూ అనువాదాలు వెలయించారు.

రాయప్రోలువారికి చిననాటినుంచే సాహిత్యవాతావరణం ఏర్పడింది. వీరి మేనమామ (తిరుపతి వేంకట కవుల శిష్యులూ) అయిన అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి గారితో కలిసి 1909 వరకు వీరు జంటకవిత్వం సాగించారు. కానీ ఈవ్యాసంగం ఎంత కాలమో కొనసాగలేదు. గంటి లక్ష్మన్న పంతులుగారి ప్రేరణతో గోల్డ్‌స్మిత్ 'Hermit' ను 'లలిత'గా రూపొందించారు. 1909 లో 'లలిత' కావ్యరచనతో రాయప్రోలు వారి కావ్య జీవితంలో కొత్త మలుపు ప్రారంభమైంది. వారి తరువాతి కావ్యాలన్నిటికీ బీజాలనదగిన అభిప్రాయాలూ భావనారీతులూ ఈ కావ్యంలో ఉన్నాయి.

రాయప్రోలు వారిలో నవ్యతకు పాదులు వేసిన వారిలో వారి పిన్నిగారు ప్రథమ స్మరణీయులు, రాయప్రోలు వారికి ఆమె జ్ఞాన చక్షుస్సును ప్రసాదించింది.ఆమె కోరికపై వారు శంకరాచార్యుల వారి "భజగోవిందం" కృతిని మూలంలోని ఛందస్సులోనే తెలుగులోకి అనువదించారు. ఒకసారి వారి పిన్నిగారి కోరికపై రాయప్రోలువారు అనసూయ చరిత్ర చదివి ముగించారు. అది విని పిన్నిగారు ఇలా అన్నారట.

"నాన్నా చూశావురా! త్రిమూర్తులు కూడా ఎలా తల్లికంటితో చూస్తే చంటిపిల్లలైనారో? ఈ లాంటి భావం మన కథాకలాపాల్లో ఇంకా అధికంగా వుంటే ప్రేమభాండం తొణికేదా? ఏ గ్రంథంలో విన్నా ఆడవాళ్ళను గూర్చి ఏమేమో వ్రాస్తారు మగవాళ్లు". ఈ వాక్కులు రాయప్రోలు వారి లేతగుండెపై చెరగని ముద్రవేశాయి. వారి కావ్యాలలో

స్త్రీకి దివ్యత్వం అలవడడానికి ప్రకృతికి మాతృస్థానం కలగడానికి వారి పిన్నిగారి మాటలు ఎంతో దోహదం చేశాయి. వారు తదనంతరం ప్రతిపాదించిన అమలిన శృంగార సిద్ధాంతానికి ఈ కాలమే ప్రాతిపదిక అనవచ్చును

1914 వరకు రాయప్రోలు వారు ఇంగ్లీషు కావ్యాలను అంతగా చదవలేదు. వర్డ్సువర్తు, కీట్సు, షెల్లీ మున్నగువారి కావ్యాలను క్షుణ్ణంగా పరిశీలించింది ఈ కాలం లోనే. 1914 తరువాతనే వారు రవీంద్రుని అంతేవాసులై శాంతినికేతన సౌరభ్యాన్నీ, వంగ కవితా మాధుర్యాన్నీ గుండెకు పట్టించుకున్నారు, ఈ లోపుగానే విజ్ఞాన సర్వస్వ రచనలో కొమర్రాజువారి సాహచర్యంతో రాయప్రోలువారి జ్ఞాననేత్రం మరింత కాంతి మంతమైంది. ఇందుకు తోడుగా కొంతకాలానికి దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి మైత్రి ఏరడ్పింది. ఈ ప్రభావాలన్నీ కించిత్ కాలవ్యత్యాసంతో కలగలిసి రాయప్రోలువారి నవభావుకతకు కవాటాలు తెరిచాయి.

## కావ్యాలు : సిద్ధాంతాలు

1909లో రచింపబడిన లలిత 1921లో పునర్ముద్రణ జరిగేటంతవరకు సాహితీ పిపాసుల దృష్టిని అంతగా ఆకర్షించలేదు. వీరు 1910లో టెన్నిసన్ రచించిన "డోరా" అనే లఘుకథా కావ్యాన్ని "అనుకృతి" అనేపేర తెనిగించారు. ఇది కూడా ఎవరిదృష్టి నాకర్షించినట్లు లేదు. 1912లో "తృణకంకణం" వెలువడింది. రాయప్రోలువారి కావ్యా లలో ఇది అగ్రేసరమైంది. దీని ప్రచురణ తరువాతనే వారి ఇతర కావ్యాలైన కష్టకమల, స్నేహలత స్వప్నకుమారము, రమ్యాలోకము, మాధురీ దర్శనము వెలువడినాయి.

రాయప్రోలువారి కావ్యాలలో లలిత, తృణకంకణము, కష్టకమల, స్వప్నకుమా రము ప్రణయం ప్రధాన వస్తువుగా కలవి. 'అమలిన శృంగారం' వీటిలోని ప్రధానరసం. రాయప్రోలువారు కరుణశృంగారాలు రెండే రసవిపాకానికి సమర్థమైనవని అభిప్రాయ పడ్డారు. పూర్ణానందాస్వాదనకు శృంగార రసం, మనోదోషశుద్ధికి కరుణారసం ఉప యుక్తమైనవని వీరి అభిప్రాయం. వీటిలో రెండవది అరిస్టాటిల్ ప్రతిపాదించిన కెథా ర్సిస్ (Catharsis) అనే లక్షణానికి సరిపోతుంది. ఈ రెండు రసాలలో శృంగారరస శేఖరత్వాన్నే వీరంగీకరించారు. శృంగార రసానికి సంభోగం అవధి అన్న పూర్వుల సిద్ధాంతాన్ని త్రోసిపుచ్చారు. సంభోగ శృంగారం ఉపాధి మాత్రమైనది కాబట్టి క్షయ మైనదనీ, వియోగశృంగారం అనుపాధికం కాబట్టి అక్షయమైనదనీ, ఇదే శ్రేష్టమనీ వీరి సిద్ధాంతం. నవ్యులు భావప్రపంచంలో ఈ అనుపాధిక సౌందర్యాన్నే సాధిస్తున్నారనీ "ఏతదమల సౌందర్యార్చనాతిరేకము" ఆత్మభావన చేత ఆనందమై ఫలిస్తుందని వీరి

వాద సారాంశము. ఇంతకూ సౌందర్యం వలన, శృంగారం వలన వీరు పొందేది అమలినమైన ఆనందం. అమలినా నందమంటే లౌకిక వాసనలకు అతీతమైన ఆనందం. అదే రసానందం. ఈ ఆనందమే రాయప్రోలువారి ధ్యేయం. వియోగశృంగారం లోని పావిత్ర్యాన్ని దృష్టిలో పెట్టుకొని వీరు అమలిన శృంగారమనే సరికొత్త సిద్ధాంతాన్ని స్థాపించారు.

వీరి కావ్యాలలో 'తృణకంకణం' ఈ అమలిన శృంగారానికి లక్ష్యగ్రంథం. ఈ కావ్యంలో ఇద్దరు యువతీయువకులు చిననాటినుంచి ప్రేమించుకుంటారు. విధివశాన వారికి వివాహం జరగలేదు. ఆ యువతికి మరొక పురుషునితో పరిణయమైంది. యువకుడు భగ్నాశుడై ఆమెను ధ్యానిస్తూనే కాలం గడుపుతుంటాడు. కొన్నాళ్లకు వారిరువురు కలుసుకున్నప్పుడు వారిలో ఏమాత్రం కామవికారంగానీ, సంయోగ కాంక్షగానీ కలగలేదు. విధికి విలపించడమే తప్ప వీసమెత్తైనా వారు మనోవికారాలకు లోనుకారు. దర్శన భాషణాలతో, మనస్సులలో ఒండొరులను స్మరించుకోవడంతో. జీవితాన్ని గడపడానికి నిశ్చయించుకుంటారు. యువకుడు పెళ్ళిచేసుకోక అలాగే వుండిపోతాడు. ఆ ఇరువురి మధ్య వెనకటి చెలికారం మరింత పక్వమైంది. ఇరువురూ అనుభవించింది వియోగమే, ఈ వియోగబాధలోనే ఒక మాధుర్య మున్నది. ఆ మాధుర్యాన్నే వారు జీవితమంతా అనుభవిస్తారని రాయప్రోలువారి సిద్ధాంతం స్త్రీని భోగ్యవస్తువుగా చేసుకున్న ప్రాచీన వ్యవస్థను, కట్లు తెంచుకొనిపోయే యువతీ యువకుల నవీన ప్రేమావస్థను, అదుపులో పెట్టడానికి రాయప్రోలువారు ఈ సిద్ధాంతాన్ని స్థాపించారు

వీరు స్త్రీలోని మాతృమూర్తిత్వాన్నీ, దైవతాంశనూ దర్శించి స్వప్నకుమారాది కావ్యాలద్వారా రూపకల్పన చేశారు. చివరికి అనాదిగా వస్తున్న పద్మభ్రమరాల ప్రేయసీ ప్రియ సంబంధాన్ని త్రోసివేసి దానిని వాత్సల్య సూత్రంలో ముడివేశారు

"సందెలను దారిదప్పు మిళిందసుతుల
తేనెపాలిచ్చి చీకట్ల దిరుగనీక
ఉదయమగుదాక యొడిలోన నిదురబుచ్చు
చేరదీసిన మమతకు చిక్కినలిని"

('స్వప్నకుమారము')

ఇది అపూర్వవిషయం. ఏ లాక్షణికులూ కవులూ ఈ సంబంధం ఊహింపలేదు. ఆధునికాంధ్ర కవిత్వంలో స్త్రీ సమారాధన తత్వానికి రాయప్రోలువారే మొట్టమొదటి ఆచార్యులు.

## వస్తుభావ రచనా నవ్యత

"కష్టకమల" లో వీరు మధ్యతరగతి బ్రాహ్మణుల జీవితాన్ని వస్తువుగా గ్రహించడం నవ్యత. ఖండకృతులలో రామన్న, భూదేవి అనే కాపు దంపతుల జీవిత చిత్రణం ఇతివృత్త నవ్యతకు మరో తార్కాణం. "ఆంధ్రావళి"లోని "తెల్లకుచ్చుల పాగ అల్లల్లనసియాడ చిన్నగొఱ్ఱెల మేపు చిన్నారి గొల్లాడ" అనే గేయంలో Postoral poetry కి బీజాలున్నవి. ప్రతి ఉగాదికి వీరు వ్రాసిన పద్యాలు గతానుగతికమైన వసంత వర్ణనలకన్న వినూత్న ధోరణిలో నడిచినవి. వాటిలో సౌందర్యదృష్టితోపాటు సామాజిక వాస్తవిక దృష్టికూడా మేళవించడం ఒక నవ్యత. ఈ పద్ధతి తరువాతి కవులకు ఉపాదేయమైంది. వీరు కవిత్వావతార క్రమాన్నీ, భాషావతరణ వికాసాన్నీ పద్యాల్లో చెప్పడం మరొక నవ్యత. కోయిలను గూర్చి పద్యాలు వ్రాసినవారిలో ప్రథములు వీరే. తరువాతి భావకవులలో ఈ శీర్షికను స్పృశించనివారు లేరు. గోఖలే నిర్యాణం పిమ్మట వీరు వ్రాసిన స్మృతి పద్యాలు (Elegy) ఆనాటి సమాజాన్ని కదిలించి వేసినవి. అలాగే రాధాకృష్ణుడు, రవీంద్రుడు, రామలింగారెడ్డి, గిడుగు మున్నగు వారినిగూర్చి వీరు వ్రాసిన సంస్తుతి పద్యాలూ, సంస్మృతి గీతాలూ వీరి వస్తునవ్యతకు తార్కాణాలు. పులివిస్తరాకుపై వీరు వ్రాసినపద్యాలు వస్తు వైవిధ్యానికి మచ్చుతునకలు. విస్తరాకుపై ఇంతటి రమ్యమైన కవిత్వం చెప్పినవారు అప్పటికీ ఇప్పటికీ వీరే.

రాయప్రోలువారి దృష్టికి సృష్టిలోని అనేక పదార్థాలు వాత్సల్యమూర్తులుగా కనిపిస్తాయి. అందుకే వారు పూలలోని తేనెను "పూలపాలు"గా భావించారు. వసంతంలో కుసుమ వికాసాన్ని దృష్టిలో పెట్టుకొని "పూలు పసుపాడి"న వన్నారు. "సుమములు బాలెంతరాండ్ర పోల్కి" అగుపించినవన్నారు. "కడుపులో తేనెలుగల కన్నెపూవు"లని వాటిని సంబోధించారు. తరంగిణులను "సస్యములకు పాలిచ్చు వాత్సల్యవతులు"గా సంభావించారు. పున్నమ రాత్రులను 'పండువెన్నెల జున్నుబాలు చేపిన రే'లని భావించారు. "రేమొదవు" వెన్నెలపాలు పితుకుతుందన్నారు. పండిన దానిమ్మ పండ్లను దృష్టిలో పెట్టుకొని దానిమ్మకు "పగడాలకానుపు" కలిగినట్లు చమత్కరించారు. ఈ విధంగా వీరి నవ్యభావనలో అధికాంశం వాత్సల్య స్ఫోరకంగానే పర్యవసించింది. ఇవి కాక రాత్రిని బుసలుకొట్టే ప్రవాహంగా, బాష్పాలను స్ఫటికమాలగా భావించడం నవ్యత. చుక్కలు మెరిసి పోవడానికి "మైలవిడిచిన పూలకోకకు మరల మొలిచెసు పూలచుక్క" లన్నారు. ఉత్సాహాన్ని వ్యంజింపచేయడానికి "నాల్కగూడ క్రొత్త చక్కిలిగింతల గుస్తరించిన" దన్నారు. నాల్కకు చక్కిలిగింత అనడం నవ్యాతినవ్య

భావం. అలాగే పాటలు తలాడగాగొని పవ్వళించడం, తలపుదీపం చూపడం, వలపు వాకిలి తీయడం వంటి అపూర్వ భావాలను ప్రదర్శించారు.

ప్రసాద మాధురీ గుణాలు గంగాయమునల వలె సంగమించిన మధురశైలి వీరిది. వీరు ప్రాచీన కావ్యరీతిని వదలక వృత్త రచన చేసినా కొన్ని సరికొత్త పదబంధాలను సృష్టించి నవ్యతాప్రీతిని కనబరిచారు. కాంక్షా క్షీరము, బాష్ప దుగ్ధముల్, నీరదసుత, సందెచిన్నది, నగ్నగీతములు, గర్వసౌరభము, కంటకకిరీటము, వెన్నెలపూలు, కోడెకోయిలలు, కన్నెతేనియ, కన్నెయెండ, సస్యపయస్సులు, పసితెమ్మెర, పచ్చిముచ్చటలు, పచ్చిముగ్గులు, పూలచెఱగులు, నింగిబాలెంత మున్నగునవి. నవ్వులలో తెలుగు నుడికారానికీ పలుకుబడికీ పదును కలిగించినవారు రాయప్రోలువారే. కడుపులో నున్న కండలు కదలడం, పుచ్చినశల్యాలు మాంసగించడం, గోచీ వదల్చి వీరకాసె కట్టడం పేర్కొనదగిన నుడికారపు చిందులు. భాషా విషయంలోకూడా రాయప్రోలు వారు స్వాతంత్ర్యం వహించారు. మధ్యాహ్న మల్లె, బాలమామిళ్ళు, బాలగులాబీలు మున్నగు మిశ్ర సమాసాలనూ, పద్యాలలోకూడా లంగరేసి, బందమేసి, నరికేటిలాంటి వ్యాకరణవిరుద్ధ ప్రయోగాలనూ రమణించు, మసృణీకరించు, స్వదించు, కన్నెగిల్లు-తీయగిల్లు మున్నగు అపురూపమైన ప్రయోగాలను చేసి తమ నవ్యతాసక్తిని కనబరిచారు.

రాయప్రోలువారు తమ కథాకావ్యాలన్నిటిలో సంప్రదాయ సిద్ధమైన వృత్తాలనూ జాత్యుపజాతులనూ స్వీకరించారు. 'దూతమత్తేభం'లో యతిప్రాసలు లేని మత్తేభాలను ఉసికొల్పారు. ఆంధ్రావళి, జడకుచ్చులు, వనమాల అనే ఖండకావ్య సంపుటులలో అనేక దేశీయ ఛ్ఛందస్సులను ప్రయోగించారు జన్మభూమి, కీలకము, శ్రీరవీంద్రకవి మున్నగునవి ద్విపదలో వున్నా కొంచెం చివరలు సాగదీస్తే ఖండగతిలో సాగిపోతాయి. గురజాడవారి ముత్యాల సరాలను అనుసరించి వీరు కొన్ని గేయాలను రచించారు. అయితే వీరి ముత్యాల సరాలలో ఏ పాదానికి ఆపాదం విడిపోదు పద్యంలోని రీతియే వీరు గేయంలో ప్రవేశపెట్టారు. యతియో ప్రాసయో విధిగా పాటించారు. విజ్ఞాపన అనే గేయంలో వియోగినీ వృత్తం వాడినట్లు వీరు చెప్పుకొన్నా ఇది చతురస్రగతిలో నడిచిన గేయమే అనిపిస్తుంది. మొత్తానికి రాయప్రోలువారు మాత్రాఛ్ఛందస్సులో కూడా చక్కని నూత్న ప్రయోగాలు చేశారు. భావకవులు పలువురికి వీరి పద్యరచనతో పాటు గేయరచన కూడా ఆదర్శమూ అనుకార్యమూ అయింది.

## దేశభక్తి కవిత్వం

దేశభక్తి కవిత్వంలో రాయప్రోలు వారు అగ్రస్థానం అలంకరించారు. 1914లోనే

"అమరావతీ పట్టణమున" మున్నగు పద్యాలు రచించి ఆంధ్రదేశాన్ని ఉర్రూత లూగించారు. 1914లో ప్రారంభమైన రాయప్రోలువారి దేశభక్తి కవిత్వం రెండుమూడు దశాబ్దాలపాటు బహుముఖంగా విజృంభించింది. 'ఏదేశ మేగినా ఎందుకాలిడినా" వంటి గేయాలలో వీరు భారత జాతీయతను ప్రబోధించారు. "చావలేదు చావలే దాంధ్రజన మహోజ్వల చరిత్ర" అని ఆంధ్రాభిమానాన్ని వ్యక్తంచేశారు. తెనుగుతల్లి అనే శీర్షికతో భిన్నప్రాంతాలలో విడివడివున్న ఆంధ్రుల సమైక్యతను సూచించారు "ఆంధ్ర" అనే శీర్షికక్రింద రాష్ట్రాభిమానాన్ని ఉద్ఘాటించారు. "తెనుగు మాన్యము" అనే శీర్షికతో వ్రాసిన పద్యాలలో ఆంధ్రభాషా ప్రాశస్త్యాన్ని ఉగ్గడించారు. తెనుగుతల్లి అనే పదాన్ని మొదట ప్రయోగించింది వీరే. తెనుగువాణి, తెనుగుకత్తి, తెనుగుభూమి మొదలైన వాటి వెనకవున్న ఆంధ్రజాతీయావేశానికి దారి చూపింది వీరే. తెలుగునదులను, తెలుగురాజుల శౌర్యపరాక్రమాలను, తెలుగుసిరిని ప్రస్ఫుట రేఖలతో చిత్రించిన ప్రముఖులు వీరే. "నాదేశము నాజాతి, నాభాష" అన్న 'అహంకార దర్శనము'ను ఆంధ్రులలో కలిగించిన దేశభక్తి కవిత్వాన్ని వెలయించి ఆ శాఖకు ఆచార్యత్వం వహించారు రాయప్రోలు వారు. అంతేకాదు. ప్రకృతి కవిత్వం ద్వారా అన్యాపదేశంగా జాతీయప్రబోధం చేసే కావ్యాలను కూడా రచించి తమ ప్రత్యేకతను నిలుపుకున్నారు.

## ఇతర కవుల ప్రభావం

రాయప్రోలువారిపై సంస్కృత కవులలో కాళిదాసభవభూతుల ప్రభావంవున్నది. లాక్షణికులలో ఆనందవర్ధనుని ప్రభావమున్నది. ఇంగ్లీషు కవులలో "సరళపద విరళార్థ విస్ఫురణము" లోనూ, ప్రకృతి చిత్రణలోనూ వర్డ్సువర్తు వీరికి ప్రథమదర్శకులు. వీరి 'మాధురీ దర్శన' కృతికీ, రాబర్ట్‌బ్రిడ్జెస్ వ్రాసిన 'Testament of Beauty' అనే గ్రంథానికీ ఆనంద సౌందర్యాల ద్వారా పరబ్రహ్మాన్ని అందుకోవచ్చుననే అభిప్రాయంలో మాత్రం పోలిక ఉన్నవి. షెల్లీ వ్రాసిన 'To A skylark' ప్రభావంతో వీరు 'కోయిల' అనే పద్యాలు రచించారు. ఇవన్నీ ఒక ఎత్తు. రవీంద్రుని ప్రభావం మరొక యెత్తు. శాంతినికేతనంలో రవీంద్రుని సాక్షాత్ శుశ్రూషా భాగ్యం లభించింది వీరికి. రవీంద్రుని సౌందర్యార్చన వీరిని ముగ్ధుల్ని చేసింది. సృష్టి ప్రేమమయం అనే రవీంద్రుని దృక్పథం వీరిపై అమితప్రభావం వేసింది. రవీంద్రుని రచనకు అనువాదమని స్పష్టంగా వీరు చెప్పుకున్న ఖండిక "వసంత" మొక్కటే. సంక్రాంతి, బుద్ధభిక్ష, పాలబాన, సఖీ సంవరణము మొదలగు గేయాలపై రవీంద్రుని రచనల ప్రభావం స్ఫుటంగా కనిపిస్తున్నది.

## అనంతర కవులపై రాయప్రోలువారి ప్రభావం

పద్యాలలో లఘుకథా కావ్యరచనకు రాయప్రోలువారే మార్గదర్శకులు. అబ్బూరి వారి "మల్లికాంబ" వీరి ఒరవడిలో నడిచిందే. కావ్యాలలో తెలుగుదేశపు వాతావరణాన్ని చిత్రించడానికి త్రోవచూపిందివీరే. పింగళి కాటూర్ల "తొలకరి"లోని ప్రకృతి కవిత్వానికీ, జనపద జీవన చిత్రణకూ మూల ప్రభావం వీరే. వీరి దేశభక్తి కవిత్వప్రభావంతోనే విశ్వనాథవారి ఆంధ్రప్రశస్తి, ఆంధ్రపౌరుషము; కొడాలివారి హంపీక్షేత్రము మున్నగు కావ్యాలు వెలువడినాయి. వీరి ప్రభావం వల్లనే భావకవులలో పలువురు కోకిలను గూర్చి మేఘాలను గూర్చి పద్యాలు రచించారు. వీరి "ప్రవాసరాధిక"లోని పద్యాలు రాధాకృష్ణుల ప్రణయ తత్వచిత్రణకు నిలువుటద్దాలు. ఈ పద్ధతిలోనే దేవులపల్లి, వేదుల రసవత్తరమైన పద్యాలు రచించారు. 'పిలుపు' అనే శీర్షికతో వీరు రచించిన పద్యాలు 'విరహవిషాద" కవిత్వానికి పథదర్శకాలు, ఆత్మాశ్రయ రీతిలో విరహబాధను వ్యక్తంచేసిన-

"నిశలు పులకించె, కనులకు నిదురరాదు
పైదలీ! యేమిటికి నన్ను బాధపెట్టి?
ఏపొదల దాగి పాడెదీ హృదయదళన
దారుణములైన నగ్న గీతమ్ములెత్తి"

వంటి పద్యాలలోని భావతీవ్రతను కృష్ణశాస్త్రి, వేదుల, నాయని మున్నగువారు సొంతం చేసుకుని ఎన్నో విషాదకావ్యాలను రచించారు.

"అమరావతీ పట్టణమున" వంటి సీసపద్యాలలోని పదశిల్పం, వాక్యసంవిధానం ఎత్తుగడ కొత్తదనం- విశ్వనాథ, జాషువా, తుమ్మల మున్నగువారి జాతీయ కావ్యాలలోని పద్యరచనపై ప్రభావం వేసినవి. బ్రతికినవారిపై ప్రశంసాపద్యాలు, మరణించిన వారిపై స్మృతిగీతాలు వ్రాయడంలో రాయప్రోలు వారే ప్రప్రథములు కాకున్నా ఈ మార్గానికి పట్టుకలుగ జేసింది వీరే.

ఈ విధంగా వస్తుభావ రచనలలో అనేక నవ్యమార్గాలు చూపి, ఇంగ్లీషు కాల్పనిక కవిత్వంలోని కొన్నిరీతులకూ. వంగవైష్ణవ సంప్రదాయాలకూ, అమలిన శృంగారాది నూత్న సిద్ధాంతాలకూ "లఘుకథా కావ్యాది బహువిధ ప్రక్రియలకూ, "దేశభక్తి కవిత్వాది ప్రబోధ కవిత్వానికీ బాటలు వేసిన అభినవాంధ్ర కవితా పితామహులు రాయప్రోలు సుబ్బారావుగారు.

# భావకవిత్వ యుగం

నవ్య కవిత్వంలో తాలోత్తాలంగా నిలిచిన ఉద్యమాలు రెండేరెండు. ఒకటిభావ కవిత్వం. రెండవది అభ్యుదయ కవిత్వం. పై రెండుద్యమాలలో భావ కవిత్వోద్యమం దాదాపు మూడు దశాబ్దాల పాటుగా ఆంధ్ర సాహిత్య కేదారంలో పసిడి పంటలు పండించింది. శేషాద్రి రమణ కవులు, కొమండూరి కృష్ణమాచార్యులు వంటి ప్రాచీన ఫక్కీకి చెందిన విద్వత్కవులు కూడా భావ కవిత్వాన్ని స్పృశించారు. కావ్య వ్యాకరణ తీర్థులైన పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారి వంటి విద్వద్విమర్శకులు దీనిని శాస్త్రీయ దృష్టితో సమర్థించారు. అభ్యుదయ యుగకర్తలైన శ్రీశ్రీగారు సైతం తొలి రోజులలో అసంఖ్యాకంగా భావకవితా ఖండికలు వెలువరించారు. 1940 లోపు కలం పట్టిన నవ కవులెవ్వరూ దీని ముద్రను తప్పించుకోలేక పోయారు. ఒక్కమాటు భావకవితావిహాయసాన్ని పరికిస్తే రాయప్రోలు, వెంకట పార్వతీశ్వర కవులు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, అబ్బూరి, దువ్వూరి, నండూరి, బసవరాజు, వేదుల, నాయని, పింగళి, కాటూరి, జాషువా, తుమ్మల, తల్లావజ్ఝల, బాపిరాజు మున్నగు కవి నక్షత్రాలు అక్షరకాంతివృష్టిని కురిపిస్తూ కనిపిస్తాయి. ఈ కవులు భావకవిత్వం లోని వివిధ శాఖలకు ప్రతినిధులు. వీరుకాక ప్రతిభామహితమైన భావకవిత్వాన్ని వెలయించిన కవులు పరశ్శతంగాఉన్నారు. ఈ భావ కవులందరూ ప్రకృతి కవిత్వం, ప్రణయ కవిత్వం, దేశభక్తికవిత్వం మున్నగు ప్రక్రియలను కొంచెం తేడాతో స్వీకరించిన వారే. కాబట్టి వారిలో నుండి ముఖ్యులయిన ఏ పదుగురి రచనలనో ఉదాహరణలుగా తీసుకుంటున్నాను. అంతమాత్రాన మిగిలిన కవులూ, వారి కృతులూ అప్రధానమైనవని కాదు.

రాయప్రోలు వారి కావ్యాలలో "భావపదము, భావగీతము" అనే పదాలు తొలిసారిగా కనిపిస్తాయి. తరువాత విశ్వనాథ వారు, కృష్ణశాస్త్రి గారు "భావగీతము" అనే శబ్దాన్ని ప్రయోగించారు. 'భావ కవిత్వ' మనే పదాన్ని గాడిచెర్ల హరిసర్వోత్తమ రావు గారు ఆంధ్రపత్రిక సహాయ సంపాదకులుగా ఉన్నప్పుడు సృష్టించారనీ డా॥ గిడుగు సీతాపతి గారు తమ "History of Telugu Literature" (Part II) లో పేర్కొన్నారు. గాడిచెర్లవారు ఈ పదాన్ని మాటిమాటికి ఆంధ్రపత్రికలో ప్రకటింపగా ఇది నవ్య కవిత్వానికి పర్యాయ పదమై పోయింది. ఈ రకమైన కవిత్వం వ్రాసేవారిని నాడు భావకవులని పిలిచేవారు. కట్టులో, జుట్టులో, నడకలో, పలుకులో, భావ కవులు తమ ప్రత్యేకతను కనబరిచారు.

భావ కవిత్వమంటే వస్తు భావ రచనలలో భావానికి ప్రాధాన్యమిచ్చిన కవిత్వం. అది ఉత్తమ శ్రేణిలో రచింపబడినప్పుడు రస శిఖరాన్ని అందుకున్న రచనయే అవుతుంది. భావ కవిత్వానికి అంతర్ముఖత్వం ప్రధాన లక్షణం. ఇది కేంద్రబిందువుగా భావ కవిత్వాన్ని పరిశీలిస్తే క్రింది విధమైన ఛాయలు అగుపిస్తాయి.

1. స్త్రీ పురుషుల బాహ్య సౌందర్యానికి బదులుగా ఆత్మ సౌందర్యం, గుణ సౌందర్యం ఈ కవిత్వంలో వర్ణింపబడినాయి.
2. కవి తన సుఖ దుఃఖాలను తెరమరుగు లేకుండా వెర్రిగా వెల్లడించుకున్నాడు.
3. ఒక్కొక్కప్పుడు అవస్థాభేదాన్ని బట్టి అతనికి కొండంత సహనం అలవడింది. అందుకు తోడుగా దార్శనిక దృక్పథం ఏర్పడింది.
4. ప్రకృతి వర్ణనలలో బాహ్య విషయాలకు బదులుగా సుకుమారమైన సౌందర్య తత్వం నిర్దేశింపబడింది. అనగా చర్మ చక్షువుకు కనిపించే ప్రకృతి కాక మనో నేత్రానికి భాసించే ప్రకృతియే వర్ణ్యమైంది.
5. జాతికి సర్వాంగ వికాసం కలిగించే సంప్రదాయ సిద్ధమైన సంస్కార దృష్టి ఏర్పడింది. పూర్వజన్మ వాసనలు మళ్ళీ ఊపిరి పోసుకున్నాయి.
6. కవి తాను విన్న, కన్న ఏ చిన్ని సంఘటనైనా హృదయ తంత్రులను ఝుమ్మనిపించి కవిత్వ రూపంలో వెలిజిమ్ముకొని వచ్చింది.
7. ఆత్మార్పణ తత్వం, ఆరాధన తత్వం పాదులు దన్నుకున్నాయి. అంతశ్చేతన లోని చైతన్యం హద్దులు దాటి వెలువడింది.
8. సామాన్యమైన లౌకిక సంతోషానికి బదులుగా సర్వే సర్వత్ర అలౌకికానందం అంచులు తీర్చుకున్నది. భావకవి చిత్రకవిత్వాన్ని నిరసించడంలో ఈ ఆంత ర్యమే ఉన్నది.
9. కవి తన కొలబద్దలతో జీవితాన్ని కొలవడం మాని తన వ్యక్తిత్వాన్ని విస్మరించి ఇతరుల సుఖదుఃఖాలలో లీనమైపోయే స్థితి ఏర్పడింది. దీనినే కీట్సు "Negative Capability" అన్నాడు.

## భావ కవిత్వ శాఖలు

భావకవిత్వంలోని శాఖలను స్థూలంగా ఈ విధంగా విభజించ వచ్చు.

1. ప్రణయ కవిత్వం (Love Poetry)
2. దేశభక్తి కవిత్వం (Patriotic Poetry)

3. ప్రకృతి కవిత్వం (Nature Poetry)
4. సంఘ సంస్కరణ కవిత్వం (Reformative Poetry)
5. భక్తి కవిత్వం (Mystic Poetry)
6. స్మృతి కావ్యాలు (Elegies)

వీటిలో ఒక్కొక్కశాఖ అనంత వైవిధ్య విలసితం. ప్రణయకవిత్వాన్నే తీసుకుందాం. ఇది రెండు విధాలుగా ఉంది. ఒకటి వస్త్వాశ్రయరీతి. రెండవది ఆత్మాశ్రయరీతి. అబ్బూరి వారి మల్లికాంబ మొదటి కోవకు చెందిన రచన. కృష్ణశాస్త్రిగారి కృష్ణ పక్షం రెండవకోవకు చెందిన రచన. పైన పేర్కొన్న ఆరు శాఖల్లో ప్రక్రియా బాహుళ్యం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈ ప్రక్రియలన్నీ ఇంగ్లీషు రొమాంటిక్‌కవిత్వ ప్రభావం ఉన్నవి కావు. వీటిలో ప్రణయ కవిత్వం, ప్రకృతి కవిత్వం ప్రాయికంగా ఆంగ్ల కాల్పనిక కవితా ముద్ర ఉన్నవే. దేశభక్తి కవిత్వంపై దీని ప్రభావం అంతగా లేదు. సమకాలీన పరిస్థితులను బట్టి, రాజకీయోద్యమాలను బట్టి పెకలివచ్చిన కవిత్వమిది. సంఘ సంస్కరణ కవిత్వం కూడా సాంఘిక స్థితి గతులనుబట్టి ఉద్భవించిందే. భక్తి కవిత్వంపైన కొంత సాంప్రదాయిక ముద్ర, కొంత రవీంద్రుని ఛాయ, కొంత బ్రహ్మసమాజం ప్రభావం అగుపిస్తాయి. ఈరీతిగా కొత్తపాతల మేలికలయికతో. సంప్రదాయ ప్రయోగాల సముచిత మేళనంలో తెలుగునాట వెలుగులు చిమ్మిందీ భావకవిత్వం.

## 1. ప్రణయ కవిత్వం

ఈ కవిత్వంలోని రెండు రీతులలో ఆత్మాశ్రయరీతియే బలీయమైనది. భావ కవిత్వంలో వస్తువుకు అంతగా ప్రాధాన్యం లేదు. రాయప్రోలువారి తృణకంకణం వస్త్వాశ్రయ రీతిలో రచించిన కావ్యమే. కానీ కవిగారి అభిప్రాయాలే పాత్రల ముఖతః వెలువడడం వల్ల అందులో ఆత్మాశ్రయ కవితాచ్ఛాయలే అధికంగా ఉన్నాయి. రాయప్రోలు తరువాత వస్త్వాశ్రయరీతిలో చక్కని ప్రణయ కవిత్వం అందించిన వారు క్వచిత్తుగా ఉన్నారు. ఉన్న కొన్ని కావ్యాలలో ఉత్తమమైనవి అబ్బూరివారి 'మల్లికాంబ', దువ్వూరి రామిరెడ్డిగారి 'కడపటి వీడ్కోలు', వెంకట పార్వతీశ్వర కవుల 'జలజమాలిక', కాళ్ళకూరి గోపాలరావుగారి 'స్నానఘట్టము' మొదలైనవి.

ప్రేమ అనేది ప్రాణికి సహజలక్షణమని ఆత్మాశ్రయ రీతిలో రచనలు చేసిన భావకవులు భావించారు. ప్రకృతిలో సంయోగ గుణమన్నది ప్రధాన లక్షణమని, పరస్పర ప్రేమయే దీనిమూలసూత్రమని షెల్లీ చెప్పిన అభిప్రాయాన్నే కృష్ణశాస్త్రిగారిలా అన్నారు.

"సౌరభములేల చిమ్ము పుష్పవ్రజంబు?
చంద్రికలనేల వెదజల్లు చందమామ?
ఏల సలిలంబు పారు? గాడ్పేల విసరు?
ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను!"[1]

ఇందులో భావకవి స్వచ్ఛమైన స్వచ్ఛంద ప్రణయాన్ని తన జీవిత ధ్యేయంగా పెట్టు కొని, అందుకు అనుగుణమైన ప్రేయసిని అన్వేషించి ఆమె నారాధించే లక్షణం కనిపిస్తుంది. భావకవి తాను ప్రేమించిన సుందరి తనకెప్పుడు వశమౌతుందోనని ఎదురు తెన్నులు చూస్తాడు. తన ప్రేయసికి తనకు మధ్య సంఘం, విధి అడ్డు రావద్దని ఆకాంక్షిస్తాడు.

"ప్రకృతి కాంతాధర రసమ్ము వడియగట్టి
పోత పోసినట్లొప్పు నొప్పుల గులాబి
క్రూరకంటక హతి సొంపు గోలుపోక
కన్నులకు విందొనర్చెడు కాలమెపుడొ"[2]

అని ఆందోళన పడతాడు. ప్రణయ రంగంలో తొలుత పూర్వరాగం — పిమ్మట సంయోగదశ. భావ కవిత్వంలోని సంయోగదశ చుంబనావస్థను దాటిపోలేదు. తాను ప్రేమించిన సుందరిని తాను కలుసుకోక ముందే ఆమె తనకు అందనిది కాగా ఆ ప్రియునికి కలిగే ఆందోళనం భావ కవిత్వంలో ప్రధానంగా చిత్రించబడింది. "తళుకమని కనిపించి వలపు వెల్లువ ముంచి వలపించి మాయమై వనట గూర్చితివా" అన్న కృష్ణశాస్త్రి గారి ఆవేదన ఈ అవస్థను సూచించేదే.

భావకవిత్వంలోని విప్రలంభ శృంగారంలో విషాదభావన పరాంకోటినందుకుంది. ఈ విషాదం అనేక భంగులలో విస్తరించింది.

"దారుణపు జీవితంపు ఎడారి లోన
తీరని పిపాస నే దారి తెన్ను లేక
నేనె నా దుఃఖ బాష్ప శోణిత లహరుల
నే విసుగు వేసటలు లేక త్రావినాను"[1]

---

1. కృష్ణపక్షము : కృష్ణశాస్త్రి
2. సౌభద్రుని ప్రణయయాత్ర: నాయని సుబ్బారావు
1. దీపావళి : వేదుల సత్యనారాయణశాస్త్రి

అని భావకవి గొంతెత్తి ఏడ్వగా ప్రకృతి సైతం చకితమైపోయింది. అతడు దుఃఖపీడి తుడై నిరాశనే వరించాడు.

"నాకుగాదులు లేవు నాకుషస్సులులేవు
నేను హేమంత కృష్ణానంత శర్వరిని"[2]

అని చెప్పుకొన్నాడు. ఈ విషాదభావం అప్పుడప్పుడు మృత్యువరణానికి మూల ప్రవృత్తిగా మారింది. అయినా ఈ భావాలన్నీ ఒక క్రమంలో కలిగేవి కావు. ఒక్కొక్క మాటు ఈ భావాలన్నీ కలగలిసి కవి గుండెను కలచివేస్తాయి. దీనినే భావ శబలత అంటారు. విషాదధాటికి తట్టుకోలేని భావకవి ఒక్కొక్కప్పుడు లోకాన్ని అసహ్యించుకొని పలాయన తత్వాన్ని అలవరచుకున్నాడు. నైరాశ్యమే తన జీవిత సర్వస్వమని ఉద్ఘోషించాడు. తరువాత తరువాత ఆ విషాద విషంలోనే ఆనందామృతం ఆస్వాదించాడు. ప్రణయకవిత్వంలో ఈ దశ సర్వోత్తమమైంది.

భావ కవిత్వంలో ప్రేయసికి పూజ్యస్థానం లభించింది. ఆ పూజ్యతను కలిగించిన వారిలో రాయప్రోలువారు ప్రథములు. విశ్వనాథవారు ప్రేయసీ సమారాధనంలో శిఖరాలనందుకున్నారు. విశ్వనాథవారి 'గిరికుమారుని ప్రేమగీతాలు'. నాయని సుబ్బారావుగారి 'సౌభద్రుని ప్రణయ యాత్ర', 'ఫలశ్రుతి' అనే కావ్యాలు భావకవిత్వంలో కులపాలికా ప్రణయానికి ప్రతినిధి కృతులు. కులపాలికా ప్రణయ చిత్రణంపైన పాశ్చాత్య ప్రభావం ఏ మాత్రం లేదు.

భావకవిత్వంలో నాయికా శృంగారం కోటికెక్కిన కావ్యాలు ఊర్వశి, కిన్నెరసాని పాటలు, యెంకి పాటలు, శశికళ, హృదయేశ్వరి, సౌభద్రుని ప్రణయ యాత్ర. వీటిలో హృదయేశ్వరిలోని నాయిక. సౌభద్రుని ప్రణయయాత్రలోని వత్సల—ఆయా కవులు వైయక్తికంగా ప్రేమించిన సుందరీమణులు. ఊర్వశి, శశికళ లౌకిక వాసనల కబీతమైన ఊహాసృష్టులు. హృదయేశ్వరిలోని నాయిక, ప్రణయయాత్రలోని వత్సల లౌకికగంధమున్న నాయికలు. ఆ కవుల జీవితంతో పెనవేసుకొనిపోయిన వాస్తవిక మూర్తులు. కిన్నెర, యెంకి—కవుల నిత్యజీవితంతో ఏ మాత్రం సంబంధించిన వారు కారు. భావనలో వారిని కదిలించి కవితారూపంలో ఆకృతి దిద్దుకున్న అమృత మూర్తులు.

## 2. దేశభక్తి కవిత్వం

ఆధునికాంధ్ర కవిత్వంలో దేశభక్తి రెండు పాయలుగా ప్రవహించింది. ఒకటి

2. ప్రవాసము : కృష్ణశాస్త్రి

భారత జాతీయాభిమాన సంబంధి. రెండవది ఆంధ్రాభిమాన సంబంధి. చిలకమర్తివారి "భరతఖండంబు" అనే పద్యం తెలుగులో భారత జాతీయోద్యమానికి సంబంధించిన తొలి రచనల్లో అగ్రగణ్యమని చెప్పవచ్చును. ఆ తరువాత మంగిపూడి వెంకటశర్మ: చెన్నాప్రగడ భానుమూర్తి ఇలాంటి రచనలు సాగించారు 1915 లో గోఖలే నిర్యాణ వార్త వినగానే రాయప్రోలువారిలో పొంగులెత్తిన భావోర్మికలతో జాతీయోద్యమ కవిత్వం తొంగిచూసింది. ఆ తరువాత వీరు వ్రాసిన 'జన్మభూమి' గేయం ఆ శాఖకు శిరోభూషణమైంది.

"ఏ దేశమేగినా, ఎందు కాలిడిన
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనిన
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము".

జాతీయ చైతన్యం అంచులు ముట్టేటట్టుగా తొణికిసలాడే గేయమిది. ఈగేయ ప్రభావంతో భారత జాతీయతను ప్రబోధించిన భావకవులలో దువ్వూరి రామిరెడ్డి, బసవరాజు అప్పారావు గణనీయులు. జాతీయ గీతాలలో కళామూల్యం కొరవోకుండా గాంధీజీని కీర్తించిన వారిలో బసవరాజు అప్పారావు గారు ముఖ్యులు. వీరి 'కొల్లాయి గట్టితేనేమి' అన్న పాట ఆ రోజుల్లో ఆబాలగోపాలాన్ని రంజింప చేసింది. ఇక గాంధీజీని గూర్చి, రాటాన్ని గూర్చి, స్వరాజ్యాన్ని గూర్చి వివిధ జాతీయోద్యమాలను గూర్చి ప్రచార స్థాయిలో పద్యాలూ, గేయాలూ వ్రాసినవారు పలువురున్నారు. బలిజేపల్లి లక్షీకాంత కవి, మాధవపెద్ది బుచ్చిసుందరరామిశాస్త్రి, గరిమెళ్ళ సత్యనారాయణ వారిలో ముఖ్యులు. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి 'రాంభజనకీర్తనలు' చమత్కార ధోరణిలో రచింపపడిన జాతీయ గీతాలే. మరికొందరు వస్త్వాశ్రయ రీతిలో జాతీయ ప్రబోధం జరిపారు. దువ్వూరి 'ద్రౌపదీ సందేశము,' కరుణశ్రీ 'ధనుర్భంగము', పెనుమర్తి వెంకటరత్నం 'దీపావళి నాడు' మున్నగు ఖండకావ్యాలు ఇందుకు ఉదాహరణలు.

భారత జాతీయ భావనం గర్భీకరించుకుని రెండు మహాకావ్యాలు వెలువడడం ఈ యుగంలోని విశేషం. అవి రెండూ ప్రొద్దుటూరులోనే సూర్య చంద్రబింబాలవలె ఉదయించిన తేజోరాశులు కావడం మరింత విశేషం. ఒకటి రాణా ప్రతాపసింహ చరిత్ర; రెండవది శివభారతం. భారతీయులు మహాత్ముని నాయకత్వంలో స్వాతంత్ర్య సిద్ధికై పడ్డపాట్లను, చేసిన త్యాగాలను అడుగడుగునా స్మరింపజేసే కావ్యం రాణా

ప్రతాపసింహ చరిత్ర. విశ్వనాథవారన్నట్లు ఈ కావ్యం అస్వతంత్ర జాతికి ఒక స్మృతిగ్రంథంవంటిది. దీని కర్త రాజశేఖర శతావధానిగారు. ఒక పసివారినుండి పండు ముసలులవరకు భారతీయులందరి చిత్తవృత్తినుడికించి శివమెత్తజేసే కావ్యం 'శివభారతం'. దీని కర్త గడియారం వెంకటశాస్త్రిగారు. దేశభక్తినీ, ధర్మపథాను రక్తినీ ధ్వనిప్రాయంగా ప్రబోధించిన మహాకావ్యమిది.

దేశభక్తి కవిత్వంలో ఆంధ్రాభిమాన కవిత ముత్తెరగులుగా ప్రవహించింది. ఒకటి దేశాభిమానం, రెండవది జాత్యభిమానం. మూడవది భాషాభిమానం. రాయప్రోలు వారన్న "నాదు దేశము నా జాతి నాదు భాష" అన్న సూత్రానికే ఇది వృత్తి. ఈ మూడింటికినీ గత వైభవస్మరణం, వర్తమాన స్థితిపట్ల విచారం, భవిష్యత్కర్తవ్య ప్రబోధం ముఖ్యలక్షణాలు. "అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాడు" అనే ప్రబోధ కవిత్వం ఆనాటి కవులను విశేషంగా ఉత్తేజపరచింది. అంతేకాక రాయప్రోలువారే 'ఆంధ్ర నౌకల'ను, 'ఆంధ్ర తేజస్సు'ను, 'ఆంధ్ర పౌరుషము'ను, 'తెలుగువాణి'ని 'తెలుగు భూమి'ని కీర్తించి ఆంధ్రాభిమానానికి సంబంధించిన సర్వాంగ సంకీర్తనలకు విస్తృత ప్రణాళికను సిద్ధపరిచారు. విశ్వనాథ, కొడాలి, జాషువా, తుమ్మల, ఏటుకూరి మున్నగువారు ఈ బాటలో నడిచినవారే పరంపరగా చరిత్రలో వినవచ్చే ఆంధ్రజాతి బహుముఖవైభవాన్ని వర్ణించడమేకాకుండా భావకవులు ఆంధ్రదేశం భౌతిక స్వరూపాన్నిగూడా అద్భుతావేశంతో ఉల్లేఖించారు. ఈ రకమైన దేశాభిమానంలో క్షేత్ర ప్రశస్తి ముఖ్యమైనది. దీనితోపాటు నదీదుర్గాది ప్రశస్తికూడా పేర్కొనదగింది. వీటిని గీర్తించిన కృతులలో కొడాలి సుబ్బారావు 'హంపీక్షేత్రము'. గంటిజోగి సోమయాజి 'రామచంద్రుని హంపీయాత్ర'; ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి 'దక్షారామము', శ్రీనివాస సోదరకవుల 'ఓరుగల్లుకోట', పుట్టపర్తి నారాయణాచార్యుల 'పెనుగొండ లక్ష్మి', దువ్వూరి రామిరెడ్డి 'కొండవీడు', విశ్వనాధ 'కొండవీటి పొగమబ్బులు'. 'ఆంధ్ర పౌరుషము' పేర్కొనదగినవి. వస్త్వాశ్రయ రీతిలో ఆంధ్రాభిమానాన్ని ప్రబోధించిన కావ్యాలు అతిస్వల్పంగా ఉన్నాయి. వాటిలో విశ్వనాద 'ఆంధ్రప్రశస్తి' అన్నివిధాలా ప్రశస్తమైంది,

ఆంధ్రాభిమానాన్ని సహేతుకరీతిలో రసవన్మార్గంలో ప్రవేశపెట్టిన రాయప్రోలు వారే అభిమానాతిరేకానికి దారితీయడం గమనింపదగిన అంశం.[1] నాటి కాలస్వభావం

1. ''తనగీతి అరవజాతిని గాయకులుగా దిద్ది వర్థిల్లిన తెనుగువాణి''-రాయప్రోలు.

అలాంటిది. ఆ అభిమానాతిరేకం విశ్వనాథవారిలో, తుమ్మలవారిలో విస్తరించింది.[2] అయితే ఆ కవులు ప్రకటించిన అభిమానాతిరేకం ఆనాటి ప్రజలకు ఆనందమే కలిగించింది కానీ ఆలోచనను తావీయలేదు.

## 3. ప్రకృతి కవిత్వం

భావకవి కవితారచనకు ప్రధాన ప్రేరకశక్తి ప్రకృతి. అతడు దానిని మనసారా ప్రేమించాడు. మానవులకన్న మిన్నగా ప్రేమించాడు. కవికి ప్రకృతి ఎప్పుడు ఆనందకందంగా భాసించిందో అప్పుడే చీకుచింతలన్నీ మరిచి దానిలో లీనమైపోవాలని కాంక్షించాడు. "ఆకులో ఆకునై, పూవులో పూవునై, కొమ్మలో కొమ్మనై, ఈ ఆడవి దాగిపోనా" అని తహతహపడ్డాడు.[1] అంతేకాదు; భావకవి ప్రకృతిని ప్రణయానికి ఉద్దీపనంగా గ్రహించడంతోపాటు తాపోపశమనానికి కూడా ఉపస్కారంగా గ్రహించాడు. ప్రకృతికి అంతటి శక్తి వుందని గ్రహించాడు కాబట్టే భావకవి దానిని ఒజ్జగా సంభావించాడు.

'శ్యామలాకాశ ఫలకమునందు దరళ
కాంతి వెదజల్లు తారకాక్షరము లొనర
విశ్వవైశాల్య బోధకవిద్య నేర్తు
శర్వరీ గర్భశాంతి యొజ్జగ విధింప' [2]

అని స్పష్టంగా ప్రకృతి తన ఉపాధ్యాయిని అని వెల్లడించాడు. క్రమశః భావకవికి ప్రకృతి తాత్విక చింతనకు దారితీసింది. పర్యవసానంగా గరికలో కూడా పరమజ్యోతిని దర్శించాడు. తనకున్న విభిన్న మానసిక ప్రవృత్తులను ప్రకృతిలో సమన్వయించుకుని సంతృప్తుడయ్యాడు.

ప్రకృతిని చూసి భౌతికమైన ఆనందాన్ని పొందడం ఈ కవిత్వంలో ప్రాథమిక గుణం. తరువాత ఆత్మికమైన ఆనంద సమాధిలో ప్రవేశించడం దీని పరమ ప్రయోజనం.

ఆధునిక కవిత్వంలో భావకవిత్వం పల్లీయ ప్రకృతికి అంగిత్వభాగ్యం కలిగించింది. విశ్వనాథవారి 'ఋతుసంహారము' ఋతువులను గూర్చిన భావనాశక్తికి మకు

---

2. ''ఆంధ్ర పౌరుషమన మాటలా రిపూత్కారముల గుండెలు వినినంత బద్దలయ్యె''– విశ్వనాథ.

1. కృష్ణపక్షము : కృష్ణశాస్త్రి
2. దువ్వూరి ఖండగావ్యములు : 'కవి' శీర్షిక.

టాయ మాన రచన. ఆయా ఋతువుల్లో పల్లెపట్టులలోని బాహిర ప్రకృతిలోనూ, సామాన్య ప్రజల ఆంతర ప్రకృతినూలో జరిగే మార్పులను విపరంగా చిత్రించే కావ్యం మిది. వీరితోపాటు పల్లీయ ప్రకృతి దృశ్యాలను కళ్లకు కట్టించిన వారిలో పింగళి కాటూరులు, దువ్వూరి, కవికొండల, బాపిరాజు పేర్కొనదగిన వారు. పల్లీయులలో కర్షకులు ప్రధానులు. కర్షకులను గూర్చి 'నిర్ఘరసార వేగం'తో కావ్యాలు వ్రాసిన వారిలో దువ్వూరి రామిరెడ్డి గారు అగ్రగణ్యులు. 1919 లోనే వీరు 'కృషీ వలుడు' అనే కావ్యాన్ని ప్రచురించి కర్షక వాఙ్మయానికి బాటలు వేశారు. ఈ కావ్యం పొలము కాపుల జీవితాలలోని సర్వతోముఖ విశిష్టగుణాలను చిత్రించింది. తుమ్మల సీతారామ మూర్తిగారి 'క్షేత్రజీవి' ఈ కోవకు చెందిన చక్కని ఖండకృతి.

ఇంగ్లీషు కాల్పనిక కవిత్వంలో Pastoral poetry అనే ప్రక్రియ యెన్నదగింది. తెలుగులో గోపాలుర జీవితాన్ని కావ్యవస్తువుగా స్వీకరించడానికి ప్రధానంగా Pastoral poetry ప్రభావమే కారణం. Pastoral poetry అంటే జానపదులు పాడుకున్న కవిత్వం కాదు. నాగరకులైన కవులు గోపాలుర జీవితానికి ముగ్ధులై రచించిన కవిత్వం. ఈ ప్రక్రియను 'గోపకావ్యము' అని ఆంధ్ర శేషగిరిరావు గారన్నారు. గొల్లవారి జీవనవృత్తాన్ని చిత్రించిన ఆధునిక కృతులలో దువ్వూరి వారి 'వనకుమారి' ఏకైక ప్రతినిధి. గొల్లవారిమీదనే కాక పడవలవాళ్ల మీద, చేపలు పట్టేవారి మీద, పాలమ్మేవారి మీద. పల్లకి బోయీల మీద వెలువడిన గేయాలు ఈ శాఖకిందికే వస్తాయి.

## 4. సంఘ సంస్కరణ కవిత్వం

రాజారామమోహనరాయల మానవోద్యమ ప్రభావంతో ఆంధ్రదేశంలో 19వ శతాబ్ది చివరనే వీరేశలింగంగారు సంఘ సంస్కరణ మహోద్యమ్యం లేవనెత్తారు. వీరేశలింగంగారు, వెంకటరత్నం నాయుడుగారు నడిపిన ఈ సంఘ సంస్కరణోద్యమమే క్రమంగా ఏకేశ్వరారాధనం, విగ్రహారాధనా నిరసనం, బాల్యవివాహ ఖండనం, వితంతు వివాహకరణం మున్నగు అనేక శాఖలుగా రూపొందింది.

అతిబాల్య వివాహాలను నిరసిస్తూ బాలవితంతువుల వివాహాలను బలపరుస్తూ అనేక కృతులూ ఖండకృతులూ వెయివడ్డాయి. వీటిలో భోగరాజు నారాయణ మూర్తి గారి 'విధవావిలాపము', మంగిపూడి వెంకట శర్మగారి 'బాలవితంతు విలాపము' గణింపదగినవి. భోగరాజు వారు వరశుల్క నిరసనగా ప్రత్యేకంగా 'పండుగకట్నము'

అనే కావ్యాన్నే రచించారు. వనితలను వంటయింటి కుందేళ్లలాగా అణచివుంచే పద్ధతిని మంగిపూడి వెంకటశర్మగారు 1914 లోనే 'అబలా విలాపము' అనే శీర్షికతో నిరసించారు. బ్రహ్మసమాజం ప్రచారం చేసిన లక్ష్యాలలో విగ్రహారాధనా నిరసన ధోరణి ఒకటి. నాటి యువకవి కృష్ణశాస్త్రిగారు 'శిథిలాలయమ్ములో శివుడు లేడోయి' అంటూ విగ్రహారాధన దృక్పథాన్ని వ్యంగ్యంగా ఎత్తిపొడిచారు.

సాంఘిక రంగంలోని అగ్రనీచవర్ణ వ్యత్యాసాలకు ఎదురుతిరిగిన కవి జాషువా. కడజాతి వానిపట్ల సంఘం చూపుతున్న నిర్దాక్షిణ్యాన్ని ఖండించి, గగనగంగ కూడా కడజాతివాని తలమీద పులిమిన పంకాన్ని కడిగి కరుణించలేదా' యని ఆక్రోశించిన కవిజాషువా. 'గబ్బిలము' అనే కావ్యం జాషువాగారి ఆక్రందనలకు అక్షరరూపం. వర్ణ వ్యవస్థా నిరసనకు ఇది ప్రతినిధి కృతి.

జాషువాగారు కేవలం వర్ణవ్యవస్థ వల్ల సంఘంలో జరుగుతున్న అన్యాయాల్నే విమర్శించారు. ఒక వర్ణవ్యవస్థే కాదు, సంఘంలోని సమస్త వ్యవస్థ కుళ్లిపోయిందని హుంకరించి విప్లవశంఖం పూరించిన వారు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు. సంఘంలో అధికార ముద్ర దాల్చిన పురాణాలూ, ధర్మశాస్త్రాలూ, ఇతిహాసాలూ అగ్రజాతులవారు తమ స్వార్థం కొరకు కల్పించుకున్న కట్టు కథలని, వారందించిన పురాణాల నల్లమందు వల్ల కడమ జాతులు మైకంలో మౌఢ్యంతో పడివున్నాయనీ, కాబట్టి సంఘ వ్యవస్థను ఆమూలాగ్రంగా మారిస్తేగానీ వాటికి విముక్తి లేదని త్రిపురనేని వారి సిద్ధాంతం ద్వారా వారు పురాణాలలోని కథలు బూతులనీ బూటకాలనీ నిరూ నించడానికి ప్రయత్నించారు. వారి సిద్ధాంతాలకూ, సంఘ వ్యవస్థా నిరసన దృక్పథానికీ ప్రతినిధికావ్యం వారి 'సూతపురాణం'.

మానవోద్యమాన్ని వ్యక్తి స్వాతంత్ర్య పరిధి నుంచి సమష్టి మానవ శ్రేయః పథకంలో ప్రవేశ పెట్టిన మహనీయుడు గాంధీజీ. గాంధీజీ సిద్ధాంతాల ప్రభావం నవ్య కవులలో కొందరిపై విశేషంగా ప్రసరించింది. వారిలో తుమ్మలవారు అగ్రేసరులు. వారి 'ధర్మజ్యోతి' ధర్మవీరానికీ, 'ఆత్మార్పణము' దయావీరానికీ మచ్చుతునకలు. పింగళి కాటూర్ల 'సౌందరనందము' స్థూల దృష్టికి ప్రణయకావ్యంలాగా కనిపించినా, విశ్వ మానవప్రేమనూ. జీవకారుణ్యాన్నీ ధ్వనింపజేసిన కావ్యం. కాటూరి వారి 'పౌలస్త్య హృదయము'లోకూడా రేఖా మాత్రంగా గాంధీయ తత్వ ప్రభావమే వుంది. తెలుగు కవులనేకులుహరిజనోద్ధరణనూ, హరిజన దేవాలయ ప్రవేశాన్నీ సమర్థిస్తూ హరిజన దేవా

లయ ప్రవేశాన్ని సమర్థిస్తూ గీతాలూ పద్యాలూ వ్రాశారు. కాటూరివారి 'గుడిగంటలు' ఈ కోవకు చెందిన రచనల్లో తలమానికం. మద్యపాన నిరసనం, వ్యభిచార నిరసనం మున్నగు వాటిని గూర్చి భావకవిత్వ యుగంలో అసంఖ్యాకంగా గేయాలు వెలువడ్డాయి. గరిమెళ్ల సత్యనారాయణగారి 'కల్లు త్రాగబోకు' అనే గీతం ప్రచార స్థాయిలో వెలువడ్డ రచనల్లో పేర్కొనదగింది.

## 5. భక్తి కవిత్వం

నవ్యకవి, సృష్టి ఒక్కటే అని ఈశ్వరుడొక్కడే అని భావించాడు. తాపత్రయ సంతప్తమైన ఈ లోకానికి పరమాత్ముడే ఏకైక గమ్యమని అభిప్రాయ పడ్డాడు. భావకవికి ప్రతిపుష్పం భగవంతుని ప్రణయలేఖగానే భాసించింది. పరమాత్ముని స్వరూపాన్ని నిర్గుణమార్గంలో భావించుకుని అతని సర్వోత్తమత్వాన్ని కీర్తించి, తన అల్పత్వాన్ని నిరసించి. అహంకార విదళనం జరిపి ఆత్మను కన్నీటితో తడిపి ఆ భగవచ్చరణ సన్నిధానంలో తనను అర్పించుకొని తృప్తుడైనాడు. భగవంతునికీ భక్తునికీ ఉన్న సంబంధం ఈ రీతిగా నిరూపితమైన భక్తి కవిత్వాన్ని పారమాత్మిక కవిత్వమని ఉల్లేఖించడం జరిగింది.

భక్తి కవిత్వంలో మధురభక్తి కవిత్వం ఒక పాయ. దీనికి వెంకటపార్వతీశ్వరుల 'ఏకాంతసేవ' ప్రతినిధి కృతి. ఈ మధురభక్తి కవిత్వం నవ్య కవితా కేదారంలో మరిరెండు పాయలుగా ప్రవహించింది. రాధాకృష్ణుల, గోపికా కృష్ణుల సంయోగ వియోగాలను, సమ్మోద విషాదాలను ఆయా పాత్రలనే ఆశ్రయించి చిత్రించేది ఒకటి. దీనికి విశ్వనాథవారి 'శృంగారవీథి' నిస్తుల నిదర్శనం. తరువాత పేర్కొన తగినవి కృష్ణశాస్త్రిగారి 'అన్వేషణము', కరుణశ్రీగారి 'కరుణామయి', చామర్తి రాజశేఖరరావుగారి 'బృందావనము' లోని 'శరద్రాత్రి', బసవరాజు అప్పారావుగారి 'గోపికా గీతములు', వేదులవారి 'రాధ', 'సంధ్యాన్వేషణము', వట్టికొండ విశాలాక్షిగారి 'ప్రణయభిక్ష', చావలి బంగారమ్మగారి 'రాధ' మొదలగునవి. ఆత్మాశ్రయ రీతిలో నవ్యకవులు తమను తాము గోపికగానో, రాధికగానో. భావన చేసుకొని రసవత్తరమైన ఖండకృతులు రచించడం మధురభక్తి కవిత్వంలో రెండవపాయ. ఈ కోవలో శ్రీకృష్ణుని వేణుగానానికి అత్యంత ప్రాధాన్యముంది. ఆ 'పాటతీపి'ని భరించే శక్తి తనకులేదని గ్రహించి

"మ్రోయింపకోయ్ మురళి మ్రోయింపకోయ్
తీయతేనియ బరువు మోయలేదీ బ్రతుకు"1

అయి, ఆ పిల్లనగ్రోవి పిలుపులో 'కాలు చల్లదనాలు', 'కనలు తీయదనాలు' 'ఏదో సౌఖ్యజ్వా'ల వున్నాయని కవి చకితుడై పోయాడు. విశ్వనాథవారు వేణుగీతాన్ని బ్రహ్మగీతమన్నారు. ఆంధ్ర భాగవతంలోని వేణుగాన వర్ణనలో ఈ తత్వమే ధ్వనిస్తున్నది. పాశ్చాత్యులు కాల్పనిక కవిత్వంలో వెలువడిన భక్తి కవిత్వాన్ని Mysticism గా భావించారు.

నవ్యకవిత్వంలో వెలువడిన తాత్విక కవిత్వం బహుస్వల్పం. తాత్విక కవిత్వం బహుస్వల్పం. తాత్విక కవిత్వం వ్రాసిన కొద్దిమంది కవులలో దువ్వూరి రామిరెడ్డిగారు ప్రథమగణ్యులు. మృత్యువును ప్రియమైన వస్తువుగా భావించడం నవ్యకవులు సాధించిన విశిష్టత. ఇంగ్లీషు కాల్పనిక కవులలో కీట్సు, భారతీయ కవులలో రవీంద్రుడు మృత్యువును ఆహ్వానించిన కవులు. ఈ ప్రభావంతోనే రామిరెడ్డిగారు మృత్యువును సఖియగా, వధువుగా సంభావించారు.

'మదిరా తత్వా'న్ని సాహిత్య లోకంలో ప్రవేశపెట్టి జగత్తునంతటిని దీనికి వశం చేసిన వాడు పారసీక కవి 'ఉమర్ ఖయ్యాం'. అతని కవిత్వం స్థూలంగా భోగలాలసతను, క్షణిక సౌఖ్యాలను ప్రతిపాదించేదిగా కనిపించినా దానివెనక ఒక గంభీర తత్వం పొదుగుకొని వుంది. ఇతని 'రుబాయీ' లలో ప్రయోగింపబడిన మధువు, పానపాత్ర, సాకీ అనేవి జీవాత్మ పరమాత్మలకు సంకేతాలని, ఇవి సూఫీ సిద్ధాంతాలను గర్భీకరించుకున్న ప్రతీకలని విమర్శకులు అభిప్రాయ పడ్డారు. ఈ 'రుబాయీ' లను తెలుగులో మొట్టమొదట అనువదించినవారు (ఇంగ్లీషు నుండి) రాయప్రోలువారే. వీరి 'మధుకలశం'లోని కొన్ని పద్యాలు తొలుత భారతిలో 1924 లోనే వెలువడ్డాయి. ఖయ్యాం రుబాయీలను పారసీకం నుంచి సూటిగా అనువదించిన ప్రత్యేకత రామిరెడ్డిగారిది. వీరు రచించిన 'పానశాల' లోని కొన్ని పద్యాలు భారతిలో 1928 లో ప్రచురింప బడ్డాయి. ఈ రుబాయీల ఇతరానువాదాలలో పేర్కొన దగిన కృతులు మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రిగారి 'ఉమరుఖయ్యాం'. రామచంద్ర అప్పారావుగారి 'అమరుక' కావ్యం. వీరితోపాటు ఆదిభట్ల నారాయణదాసుగారు, మల్లవరపు విశ్వేశ్వరరావుగారు మున్నగువారు గేయరూపంలోనూ పద్యరూపంలోనూ ఈ రుబాయీలను అనువదించారు. ఈ అనువాదాలన్నిటిలో దువ్వూరివారి 'పానశాల', రాయప్రోలువారి

1. కృష్ణశాస్త్రి

'మధుకలశము'-ఈ రెండే ఆంధ్రదేశంలో ప్రసిద్ధకృతులు. ఈ రెంటిలోనూ ఆంధ్రుల రసనాంచలాలపై ఆడిన అనేక పద్యాలు 'పానశాల'లోనివే అనడం సత్యదూరం కాదు.

## 6. స్మృతి కావ్యాలు

పాశ్చాత్యుల ఆత్మాశ్రయ కవిత్వంలో Elegy ప్రధానమైంది. Elegy ని తెలుగులో శోకగీతమని, శోకకావ్యమని కొందరన్నారు. తాపీ ధర్మారావు గారు 'కారుణ్యము' అని నామకరణం చేశారు. కానీ Elegy కి సమానార్థకంగా స్మృతిగీతం, స్మృతికావ్యం అనే పదాలే సముచితమైనవని నా అభిప్రాయం. వైవిధ్యాన్ని దృష్టిలో పెట్టుకుని ఈ స్మృతికావ్యాలను నాలుగు వర్గాలుగా వింగడించవచ్చు. 1. దేశనాయక స్మృతి: ఇందులో రాజకీయ సాంఘిక కళాది రంగాలలో ప్రసిద్ధులైన వారిని గూర్చిన స్మృతికావ్యాలు చేరుతాయి. రాయప్రోలు వారి 'రవీంద్రుని అస్తమయము'. కృష్ణశాస్త్రి గారి 'మహాకవి', జాషువా గారి 'బాపూజీ', తుమ్మల వారి 'విశ్వదాత' మున్నగునవి పేర్కొన దగినవి. 2. సతీ స్మృతి: అగ్నిసాక్షిగా పరిణయ మాడిన ఇల్లాలి మరణం పట్ల వ్రాసిన స్మృతికృతులు ఈ విభాగంలో చేరుతాయి. ఈ కృతులలో విశ్వనాథ వారి 'వరలక్ష్మీ త్రిశతి' శేఖర కృతి. ఈ శ్రేణికి చెందిన రచనల్లో దువ్వూరి వారి 'భగ్న హృదయము', బాలాంత్రపు వెంకటరావు గారి 'విరహ సంగీతము' పేర్కొన దగినవి. 3. సుతాదిక స్మృతి: ఈ కోవకు చెందిన రచనల్లో బసవరాజు అప్పారావు గారి 'నిర్యాణ సుఖము', దువ్వూరి వారి 'శిశు వియోగము' గణనీయ కృతులు.

> "కాపుర మొచ్చిన కన్నిపాపాయి
> ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాడు"[1]

వంటి పంక్తులు ఈ శాఖలో పూచిన అమ్లాన కుసుమాలు. 4. ఆప్త స్మృతి: తల్లి దండ్రులు, సోదరీ సోదరులు, ఆప్తమిత్రులు మున్నగువారి నిర్యాణంతో వెలువడిన రచనలు ఇందులో చేరుతాయి. నాయని సుబ్బారావుగారి 'మాతృగీతాలు' మాతృస్మృతి కెత్తిన మణిదీప కిరణాలు. ఈ శాఖకు చెందిన కవులలో కొడాలి సుబ్బారావు, పెనుమర్తి వెంకటరత్నం, మోటూరి వెంకటరావు, అబ్బూరి రామకృష్ణారావు గార్లు చెప్పుకో దగ్గవారు.

ఇంతవరకు భావకవిత్వం లోని వివిధ శాఖలను గురించి వివేచించడం జరిగింది. ఇక భావకవిత్వంలోని నవ్యతను స్పృశించి చూపుతాను.

---

1. బసవరాజు గీతాలు.

## భావకవిత్వం: నవ్యత

ఇంగ్లీషు కాల్పనిక కవిత్వంలో ఇమేజరీ (Imagery) ప్రధాన స్థానం ఆక్రమించింది. ఇమేజరీ అంటే స్థూలంగా కల్పన అనవచ్చు. ఇమేజ్ అంటే కల్పనా చిత్రమనాలి. కానీ ఇమేజ్ అంటే మాటలతో కట్టిన బొమ్మ కాబట్టి పదచిత్రాలంటే సరిపోతుంది.

భావకవిత్వంలోని పద చిత్రాలను రెండు తెగలుగా విభజించవచ్చు. 1. భావ చిత్రాలు, 2. ఊహా చిత్రాలు. భావచిత్రాలు హృదయానికి సంబంధించినవి. ఊహా చిత్రాలు బుద్ధికి సంబంధించినవి. భావకవులలో భావ చిత్రాలున్నంతగా ఊహాచిత్రాలు లేవు. భావచిత్రాలు వేసిన వారిలో కృష్ణశాస్త్రి, వేదుల, విశ్వనాథ, దువ్వూరి, నాయని మొదలగువారు ప్రసిద్ధులు, రససిద్ధులు. వారు ప్రధానంగా హృదయ తంత్రికలను స్పందింపజేసే మెత్తని భావచిత్రాలనే ప్రయోగించారు. అయితే విశ్వనాథ 'కిన్నెరసాని' పాటలలో, జాషువా 'స్వప్నకథ'లో మిన్నుముట్టే ఊహాచిత్రాలు కొన్ని లేకపోలేదు.

భావకవిత్వం ప్రధానంగా ప్రసాద మాధుర్య గుణాలను పెనవేసుకుని పుట్టింది. దేశభక్తి కవిత్వశాఖలో తప్ప ఓజోగుణం ఈ కవిత్వంలో అంతగా కనిపించదు. అందుచేత ఈ కవితకు లలిత మధుర పదవిన్యాసం, శైలీ సౌకుమార్యం, అలతియలతి జిలుగు విరుపులు సహజ గుణాలై పోయినవి. ప్రణయ కవిత్వం లోని వృత్తాలన్నీ ప్రధానంగా నన్నయ శైలినో, నంది తిమ్మన వంటి ప్రబంధ కవుల బాణీనో పుణికి పుచ్చుకున్నాయి. గీతపద్యం నడకలలో భావకవులు అపూర్వమైన విరుపులనూ జిలుగులనూ సాధించారు. దేశభక్తి కవిత్వశాఖలో సీసపద్యాన్ని రకరకాలుగా కదను తొక్కించారు.

భావకవులలో కృష్ణశాస్త్రిగారి చేతిలో పాతశబ్దాలే కొత్త పరిమళాలనూ, సరికొత్త వన్నెలనూ సంతరించుకున్నాయి. "ఎలదేటి చిరుపాట సెలయేటి కెరటాల బడిపోవు విరికన్నె వలపు", "తొలిప్రొద్దు తెమ్మెర తోవలో పయనమై పరువెత్తు కోయిల పాట" "కారు రాతిరి కొసలు", "ఇరుల గుసగుసలు" మొదలైన అచ్చమైన తెలుగు మాటల కూర్పుల్లో, 'కరుణార్ద్ర వీక్షణ పరిమళములు', 'విరహవీక్షణ భయంకర మాధురులు, 'అగమ్య తమస్వినీ గర్భకుహరాలు', అంగుళీ కిసలయ చంచలాంచములు', హేమంత కృష్ణానంత శర్వరి మున్నగు సంస్కృత సమాసాల పోహళింపుల్లో అపూర్వ నవ్యతా భరితమైన కమనీయకం వెల్లివిరుస్తున్నది. తెలుగు కవిత్వంలో జిలుగు నగిషీలను,

సన్నపోగారుతనానికి ఎంత వీలున్నదో అంత సాధించి చూపారు కృష్ణశాస్త్రి గారు. వీరి శైలికి మించిన సౌకుమార్యాన్ని సాధించడానికి ప్రయత్నం చేయడమంటే మధు ధారను జలధారగా మార్చడమే.

అపూర్వ పదబంధాలు ప్రయోగించండలో భావకవిత పరాంకోటి నందుకున్నడి. ఇవి రూపకాలు కావచ్చును లేక కర్మధారయాది సమాసాలు కావచ్చును. నీలంపు సిగ్గు, అశ్రుఝరులు, హాస మృదుల వాసనలు, కొసరు తేనియలు, నెత్తావి గుసగుసలు, నిర్జీవ నిశ్శబ్దము, సురభిళాహ్వానములు, కైశికధ్వాంత నిశ్శబ్దము, రహస్తీరాలు, నిదుర చెర, నీలినీడ, కారు రాతిరి కొసలు, కార్చిచ్చు మంటయేళ్ళు, వలపుటాకలి, మూగ కనులు, వేదనాసుఖము, అరుణారుణాంధ గీతి, అమవస కన్నీటిపాట, ఇరుల గుసగుసలు, ముదుసలి నిరాశలు, పాటరెక్కలు, తీయతేనియ బరువు, విశ్వ వీణాగళము, విరహ విపంచి, సురభి సౌదామని, నిదుర పొదిగిళ్ళు—(కృష్ణ పక్షము, ప్రవాసము, ఊర్వశి నుండి): బాష్పభాషణములు, పూల వెన్నెలలు, మబ్బు కన్నెలు, వలపు నివాళి, తేనె తావుల బరువు, తలిరుటెడద, జీవితంపు ఎడారి, ఆశావిపంచి, మబ్బు కౌగిళులు, రేయికాటుక కనులు, చంద్రికా వసనము, విరహవిషాద రేఖ, నిసి కంటినీరు, తెమ్మెర యూర్పు— (దీపావళి నుండి): పోతు వెన్నెలలు, పూల దీపము, వెలుగు పోచలు, నులివెచ్చ చిక్కవెన్నెలలు, కల్పపడంతి యూరుపులు, తావి దివ్వియ, వెచ్చ వెన్నెలలు — (శశి దూతము నుండి): తుషార దూతికలు, మేఘ పతాకలు- (సౌభద్రుని ప్రణయయాత్రనుండి): లేత గుసగుసలు, గాలి బాలిక, తలిరు తురాయి— (మధుకీల నుండి) : జాలివెన్నెల (గబ్బిలము నుండి) : మంచుమంట— (హిమగళము నుండి) ...ఇలాంటి వినూత్న పదబంధాలెన్నో వున్నాయి.

భావకవులు వృత్తాలను, జాత్యుపజాతులను, మాత్రా ఛందస్సులను సమానాభి రుచితో సంతరించారు. గద్య పద్య మయమైన చంపూరీతి రాయప్రోలుతోనే పరిత్యక్త మైంది. భావకవులు కూడా ఈపద్ధతిలోనే కేవల పద్య గేయకావ్యాలు రచించారు. గద్య పద్య సమ్మేళనం స్థానే పద్యగేయ సమ్మేళనం వీరి ప్రత్యేకత. సౌభద్రుని ప్రణయ యాత్ర, గిరి కుమారుని ప్రేమగీతాలు, మల్లికాంబ వంటివి కేవల పద్య రచనలు. కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి, హృదయేశ్వరి, దీపావళి, ఊహాగానము మున్నగు నవి పద్యగేయ మిశ్ర రచనలు. కిన్నెరసాని పాటలు, వకుళమాల, శశికళ, యెంకి పాటలు మున్నగునవి కేవలం గేయకృతులు. ఈ కవులలో శివశంకరశాస్త్రి గారు అనేక గతులలో అసంఖ్యాక గేయ పద్య రూపకాలు రచించారు. వీరు కొన్ని వృత్తా

లను మూడు పాదాలతో రెండు పాదాలతో రచించారు. గీత పద్యాలలో భావం ఎక్కడ విరుగుతుందో అక్కడికే పాదం సమాప్తమయ్యే పద్ధతి ప్రవేశపెట్టారు. కృష్ణశాస్త్రి గారు కొన్ని సందర్భాలలో గీతపద్యాన్ని మధ్యలో యెత్తుకొన్నారు. భుజంగ ప్రయాతం వంటి ప్రాచీన వృత్తాలకు వెల్లవేసి గేయాభాస కలిగేటట్లు కొందరు రచించారు. సీసపద్యాలను వచన గేయాలవలె అచ్చువేసి ఇంద్రజాలం చేసినవారు వెంకట పార్వతీశ్వర కవులు. ఈ పద్యాలను చదువుతుంటే వచనగేయాలే అనిపిస్తాయి.

భావకవుల గేయాల్లో ప్రధాన గుణాలు గతి చమత్కారం, లయవిన్యాసం. గేయాలలో అధికభాగం ఐదైదుమాత్రల గణాలతో నడిచే ఖండగతిలో వున్నాయి. యెంకిపాటల్లో ఏ కొన్నో తప్ప మిగతావన్నీ ఈ గతిలోనే వున్నాయి. కృష్ణశాస్త్రి గారి గేయాలుకూడా అధికభాగం ఈ గతిలోనే వున్నాయి. ఇది ద్విపదకూ సీసానికీ సన్నిహితంగా వుండడంవల్ల, మన కవులు మొదట పద్యాలతోనే కవితా వ్యాసంగం ప్రారంభించినందువల్ల ఈ ఖండగతి అనుకోకుండా వారిని వశపర్చుకున్నది. ఈ ఖండ గతిలోనే పాదసంఖ్యలో, మాత్రాధిక్యంతో, మాత్రాలుప్తితో ఈ కవులు సాధించిన నవ్యత అపూర్వం. భావకవిత్వ గేయాలలో చతురస్రగతి క్వచిత్తుగా ప్రయోగించబడింది. కిన్నెరసాని పాటల్లో ఈగతి సమ మాత్రాకంగా, సమపాదంగా ప్రయోగింపబడింది. తల్లావజ్ఝలవారు చరణాల చివర 'ప్రియురాలః' అనే మకుటాన్ని పునరావృత్తం చేసి నవ్యత సాధించారు. దువ్వూరి వారు 'ఆమని నిషా'లో కొన్నిచోట్ల మాత్రలు పెంచారు. ఇకపోతే మిశ్రగతి ముత్యాల సరంగా నవ్యకవిత్వంలో అశేషవ్యాప్తి పొందింది. రాయప్రోలు, విశ్వనాథ, అబ్బూరి, నండూరి, దేవులపల్లి, బసవరాజు, వేదుల మున్నగువారు కనీసం ఒక్క ముత్యాల సరమైనా సంతరించిన కవులే. వీరు ఈ గేయ గతిలో సాధించిన వైచిత్రి గణింపదగింది.

భావకవులలో వచనగేయాలు వ్రాసిన వారిలో కవికొండల వెంకట్రావు, రామచంద్ర అప్పారావు, మల్లవరపు విశ్వేశ్వరరావు, దువ్వూరి రామిరెడ్డి పేర్కొనదగిన వారు. కవికొండలవారు 'నక్కసామి గాడు' అనే వచనగేయాన్ని 1933 లోనే రచించారు.[1] దీనిని 'వచన గీతిక' అని వారే స్వయంగా వ్రాసుకున్నారు. రచన శుద్ధ వ్యావహారికంలో ఉండడం, చమత్కారమైన అంత్యనియమాలుండడం. చరణ విభాగం

---

1. "నక్కసామిగాడు వాడొక మాలవాడు రాజుగారి కమతంలో పాలేరుగాడు. వాడు పోయాడు......"దెందులూరు కాడాక్కుండా వెళ్ళిన మెయిల్నీ ఆగిన మా ప్యాసెంజరు రయిల్నీ రెండింటినీ కూడా మరచి...స్తాయి......" ఈ విధంగా సాగిపోయిన వచన గేయమిది.

ఆధునిక వచనగేయం లాగే వుండడం ఈ గేయంలోని ప్రత్యేకత. రామచంద్ర అప్పారావుగారి 'రక్తవిహారము' అనే గేయం కొంతదూరం వచనగేయం లాగా సాగి, మధ్యలో తేటగీతిగా మారి, మళ్ళీ వచనగేయంగా రూపొంది చివరికి తేటగీతిగా ముగుస్తుంది. మల్లవరపు వారి 'కళ్యాణ కింకిణి'లో 'స్త్రీ' అనే శీర్షికతో చక్కని వచన గేయముంది. ఇది శ్రీశ్రీ 'కవితా! ఓ కవితా!' అనే గేయాన్ని పోలివున్నది. దువ్వూరి వారి 'నైవేద్యము'లో 'లూతీ' వచనగేయం. దీనిని ప్రయత్నించి చతురస్రగతిలోనికి ఈడ్వవచ్చును. కానీ స్థూలంగా వచనగేయంలా కనిపించే రచనయిది. విశ్వనాథవారు 'శృంగార వీథి' చివర 'రాధిక' అనే శీర్షికతో కొన్నివచనాలు రచించారు.

అభ్యుదయ కవిత్వ యుగంలో శిష్ట్లా, నారాయణబాబు, పఠాభి, శ్రీశ్రీ మున్నగు కవుల చేతులలో సహస్రాంచలాలతో పెరిసిన వచనగేయానికి భావకవిత్వయుగంలోనే- ఇరవయ్యో శతాబ్ది మూడవపదిలోనే- బీజావాపం జరిగిందనవచ్చును.

## భావకవిత్వంపై తిరుగుబాటు

1930 వరకు ఆంధ్రకవితా రంగంలో భావకవిత్వం అప్రతిహతమైన ప్రభావం కలిగివుంది. కవిత్వం వ్రాయనేర్చిన యువకు లందరూ ఆ రోజుల్లో దీని ప్రభావానికి లోనైన వారే 1930 నుంచి ఈ కవితాశాఖకు కృశత్వం ప్రారంభమైంది. రాయప్రోలు కృష్ణశాస్త్రి ప్రభృతుల రచనలకు అంధానుకరణం ప్రబలింది. శబ్ద వ్యక్తీకరణకే ప్రాధాన్యమేర్పడి అర్థగాంభీర్య మడుగంటింది. జిలుగుపలుకుల సన్నపోగారుతనం మీదనే దృష్టి కేంద్రీకృతం కావడం వల్ల భావనాబలం సన్నగిల్లుతుంది. ఆత్మవ్యక్తీకరణ ధోరణి నానాటికి ముదిరిపోయి సంఘదృష్టి మరుగుపడి పోయింది ఈ స్థితిలో క్షీణదశోన్ముఖమైన భావకవిత్వం పైన తిరుగుబాటు చేసి సరికొత్త ప్రయోగాలను చేసిన కవులు శిష్ట్లా ఉమామహేశ్వరరావు, శ్రీరంగం శ్రీనివాసరావు, శ్రీరంగం నారాయణబాబు, పఠాభి — వీరితోపాటు గొంతుకలిపిన వారు ముద్దుకృష్ణ, పురిపండా అప్పలస్వామి. అయితే ఈ తిరుగుబాటుదారులు ఒక్కుమ్మడిగా జూలు దులుపుకొని గళ శంఖ మొత్తి గర్జించినవారు కారు ఆ తరంలోని కవులందరివలెనే వీరుకూడా ప్రథమ దశలో భావకవితా పథాలలో పయనించారు. ప్రేయసి కొకరు అంగలార్చారు. శిష్ట్లా 'విష్ణు ధనువు'లోని ప్రధానవస్తువు ప్రణయమే. అయినా దాన్ని వ్యక్తీకరించే వైఖరి మారింది. పురిపండా, ముద్దుకృష్ణ మొదటి దశలో భావగీతాలు వ్రాసినవారే. నారాయణబాబు వ్రాసిన వలపుచెలకులు సంధ్యావేగము మున్నగునవి అచ్చమైన భావగీతాలు. శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీశ్రీ) ప్రథమ కావ్యసంపుటి 'ప్రభవ' లో అధికాంశం భావకవిత్వమే: వీరందరూ తమకు ముందున్న భావకవిప్రముఖుల ప్రభావంతో తొలుత అనుకరణ శీలమైన రచనలు చేసినా వీరిప్రతిభ నివురు గప్పిన నిప్పులాగా ప్రజ్జ్వలనావకాశం కోసం

ఎదురుచూస్తూ వుంది. భావకవిత్వం పట్ల వీరిలో సహజంగా కలిగిన విముఖత కొత్తదనం కావాలనే కాంక్ష, పాశ్చాత్య సాహిత్యంలోని అతి నవ్యకవితా రీతుల ప్రభావం, భారతదేశ రాజకీయ సాంఘిక రంగాలలో జరుగుతూ వున్న మార్పులు, ప్రపంచ రాజకీయ పరిణామాలు-- ఇన్ని ప్రభావాలు కలిసి, ఈ కవుల హృదయాలతో పెనవేసి కొంతకాలానికి కొంగ్రొత్త ప్రయోగాల రూపంతో వెలువడ్డాయి ఈ కవులలో ఏ ఒక్కరూ మొదటిదశలో ఒక ప్రత్యేక కవితోద్యమానికి చెందినవారు కారు. అలజడియే ఊపిరిగా, తిరుగుబాటే ధ్యేయంగా రచనలు చేసినవారు. ముఖ్యంగా ఛందస్సులో శిష్ట్లా, పట్టాభి, వస్తువులో శ్రీశ్రీ, నారాయణబాబు తిరుగులేని తిరుగుబాటు లేవదీశారు.

ఛందస్సు విషయంలో శిష్ట్లా అద్భుతమైన ప్రయోగాలుచేశాడు. 'విష్ణుధనువు'లో ప్రయత్నపూర్వకంగా ఛందస్సును వికృతం చేశాడు. కొన్నిపద్యాల తునకలను, కొన్ని మాత్రాబద్ధ గేయఖండాలను, కొన్ని వచనపు తుంటలను ఇష్టంవచ్చినట్లు పేర్చి విశృంఖల మనస్తత్వాన్ని ప్రదర్శించాడు. భాషవిషయంలో కూడా ఇతడు కొంతనిర్లక్ష్యతను, విశృంఖలతను కనబరిచాడు. సింబాలిజంలో శబ్దార్థం కంటె వాతావరణ కల్పనమే ప్రధానం. అపప్రయోగాలు అర్థరహితాలైనా ఒక విచిత్రార్థ స్ఫురణం కలిగిస్తాయి కదా అనే భావంతో శిష్ట్లా ఈ చమత్కారాలు చేసి వుంటాడు. పురాణ సంబంధి పాత్రలను తీసుకొని నవీన భావాలను వెల్లడించడంలో ఈ కవిపై టి. యస్. ఇలియట్ ప్రభావం వుంది. వచన గేయంలో సమగ్ర కావ్యసంపుటిని ప్రకటించడంలో ఇతడే ప్రథముడు. వచనగేయ ప్రక్రియ విషయంలో ఒకరకంగా శ్రీశ్రీ ప్రభృతులకు ఇతడు మార్గదర్శి అని చెప్పాలి. తన నూతన కవిత్వానికి ఇతడు 'ప్రాహ్లాదకవిత్వ' మని పేరు పెట్టుకొన్నాడు "ప్రాహ్లాదకవిత్వం" ఆరిపోయే దీపాన్ని రగుల్చుతుంది. పరుగెత్తే పామరుణ్ణి నిలేస్తుంది"[1] అని ప్రకటించాడు.

పఠాభి పూర్తిపేరు పట్టాభి రామిరెడ్డి. పట్టాభి అనే శబ్దాన్ని 'పఠాభి'గా మార్చుకోవడంలోనే అతని నవ్యతాప్రీతి కనిపిస్తుంది. అతని కవితా సంపుటి 'ఫిడేలు రాగాల డజన్' పాశ్చాత్యవాద్యమైన ఫిడేలుపై ఆధునికకాలంలో కర్ణాటక సంగీతం పలికించినట్లుగా, ఇంగ్లీషు కవితారీతులను తెలుగుభాషలో ప్రదర్శింపవచ్చనే ఉద్దేశంతో కవి ఈ నామకరణం చేసివుంటాడు. తనకు విచిత్రమైన భావాలున్నాయనీ, తనకళ్ళలో టెలిస్కోపులు, మైక్రోస్కోపులున్నాయని చిత్రంగా చెప్పుకున్నాడు.

"నా ఈ వచన పద్యాలనే దుడ్డుకర్రల్తో
పద్యాల నడుముల్ విరుగదంతాను;

1. నవమి చిలుక: మున్నుడి.

చిన్నయసూరి బాల వ్యాకరణాన్ని
చాల దండిస్తాను"[1]

అంటూ తెలుగు వ్యాకరణంపై ఛందస్సుపై దాడిచేశాడు.

"అనుసరిస్తాను నవీనపంథా; కానీ
భావకవిన్ మాత్రము కాన్నే; నే
నహంభావ కవిని''[2]

అంటూ అహంకారాన్నీ విశృంఖలత్వాన్నీ ప్రదర్శించాడు. తెలుగులో ఇంతనిర్భయంగా నిరంకుశంగా తిరుగుబాటు ప్రకటించిన వారు లేరు. ఈకవి పద్యాల నడుములే కాక గేయాల నడుములను కూడా విరగదన్నినాడు. వచనగేయాలను నడిపించడంలో ఇతని కొక పద్ధతి ఉన్నట్లులేదు. అంతర్లయ, ఊపు, విడుపు మొదలైన వచన గేయగుణాలు ఈ సంపుటిలో కొరవడ్డాయి. భాషకూడా ఒకపద్ధతిలో లేదు. వచనంలోని కర్త కర్మ క్రియలను తలక్రిందులు చేసి గేయరూపంలో పేర్చాడు. శ్రీశ్రీ దీని 'ఇంట్రో'లో వెలిబుచ్చినట్లుగా "అవ్యయం అనాచ్ఛాదితంగా ఆకాశమధ్యంలో ఊగవచ్చును. విభక్తి విశృంఖలంగా షికారు పోవచ్చును" అనే మాటలను అక్షరాలా నిరూపించాడీ కవి. నగర జీవన చిత్రణానికి నాంది పాడినవాడూ ఇతడే. అత్యాధునిక జీవితంలోని వివిధ ఘట్టాలను గూర్చి కవిత్వం వ్రాయడంలోనూ ప్రథము డీతడే. శబ్దార్థ వైచిత్రిలో నవ్యత తీసుకొచ్చినవాడూ ఇతడే. 'ఫ్రాయిడ్' ప్రతిపాదించిన సెక్స్ ప్రాధాన్యాన్ని తొలిసారిగా తెలుగులో ప్రవేశ పెట్టినవాడూ ఇతడే.

భావ కవిత్వంలోని ఆదర్శ వాదానికి (Idealism) వ్యతిరేకంగా తిరుగుబాటు చేసి వాస్తవికతావాదం (Realism) ప్రతిపాదించిన కవి నారాయణ బాబు. భావ కవిత్వంలోని అతీంద్రియ కల్పనలకూ, లలితశైలికీ, మధురపద సమ్మేళనానికీ, అభూతసౌందర్య దృష్టికీ విరుద్ధంగా ఈ కవి తిరుగుబాటు చేశాడు. ఇంద్రియ గోచర మైన చైతన్యమంతా కవికి వర్ణ్యమనీ, సౌందర్యం ఒక్కటే ఆరాధ్యం కాదనీ, అసుందర వస్తువులనుకూడా కవితా వస్తువులుగా స్వీకరించ వచ్చుననీ ఈతడు నిరూపించాడు. భావకవితా రంగంలోని ప్రణయ కవితాశాఖను నిరసించాడు. యథార్థ జీవిత చిత్రణను బలపరిచాడు. ప్రకృతిలోని బీభత్సాన్ని గమనించిన కవి దానిని చిత్రించాలిగాని, ఇసుకలో తలదూర్చిన ఉష్ట్రపక్షిలా పరిస్థితులను విస్మరించి వుండకూడదని ఉద్ఘోషించాడు. వాస్తవికతనూ, అధి వాస్తవికతనూ (Sur-realism) రెంటినీ సమన్వయ పంచుకున్న అతినవ్యుడు నారాయణబాబు. ఇంగ్లీషు కవిత్వంలోని ఇమేజిజం (Imagism) ప్రభావం కంఠదఘ్నంగా వున్న చాలా కొద్దిమంది తెలుగు కవులలో ఈతడు ప్రముఖుడు.

భావ కవిత్వంపై తిరుగుబాటు చేసిన వారిలో అగ్రేసరుడు శ్రీశ్రీ. శ్రీశ్రీకి, మిగిలిన తిరుగుబాటుదార్లకూ వున్న భేదమేమిటంటే— వారు తిరుగుబాటు చేశారే కానీ

1, 2: ఫిడేలురాగాల డజన్

సరికొత్త బాట వేయలేదు. అలజడియేతప్ప ఆలోచనను అవలంబించలేదు. నిరు లనం, నిర్మాణం— రెంటినీ నిర్వర్తించినవాడు శ్రీశ్రీ. శ్రీశ్రీ జననం ముత్యాల సరా పుట్టిన సంవత్సరం (1910), 1928లో శ్రీశ్రీ రచించిన భావగీతాలూ, పద్యా కవితాసమితి తొలిప్రచురణగా 'ప్రభవ' రూపంలో వెలువడ్డాయి. ప్రభవనాటికి శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావుగానే వున్నాడు. ప్రభవలోని కవితా ఖండికలను పరిశీలి శ్రీశ్రీ భావకవిత్వ ధోరణి స్పష్టంగా బోధపడుతుంది. వస్తువరణంలోనే కాక భావన పద ప్రయోగంలో, పద్యసంధానంతో శ్రీశ్రీ తన సమకాలిక కవిప్రముఖులైన కృ శాస్త్రి, విశ్వనాథ మున్నగువారిని అనుకరించాడు ఇంతటి అనుకరణ శీలం వున్న సంపుటిలో కూడా శ్రీశ్రీ భవిష్యత్ప్రతిభ తటిత్ప్రాయంగా భాసింపక పోలే 1928లో శ్రీశ్రీకి కొంపెల్ల జనార్దనరావు సహవాస మేర్పడింది. తత్ఫలితంగా వె తాను వ్రాసిన 'ప్రభవ'లోని పద్యాలన్నీ రెండవశ్రేణికి చెందిన ప్రతిధ్వనులని శ్రీ నిర్ణయించుకున్నాడు. అప్పటినుంచి కొత్తదనం కోసం కోరిక లీరికలెత్తడం ప్రారం మైంది. దాని ఫలితంగా 1929లో 'సుప్తాస్థికలు' అనే కవితా ఖండిక వెలువడిం ఆరుద్ర అన్నట్లుగా 'సుప్తాస్థికల'తో శ్రీశ్రీ కుబుసంవిడిచాడు. 1933లో శ్రీశ్రీ వ్రా 'విద్యున్మాలికలు'అతని మొదటి వచనగేయం. పైనలుగురిలోకూడా శ్రీశ్రీయే మొట్టమొద వచనగేయం వ్రాశాడు. అంతవరకు పద్యచ్ఛందస్సునో గేయఛందస్సునో ఆశ్రయిం కుని వున్న శ్రీశ్రీ ఛందోనియమోల్లంఘనం చేసి ఈ గేయాన్ని రచించడం సాహ పేతమైన ప్రయోగం. 1930లో శ్రీశ్రీ టైఫాయిడ్‌తో మంచంపట్టాడు. అతని అపూర్వమైన అలజడి ప్రారంభమైంది. మానసికంగా శారీరకంగా అతనిలో 'ఆ యుగం' రెక్కలు విప్పుకుంది. 'రావద్దు రావద్దు లోనికి వ్రాస్తున్నానొక గీతం'అం తనలో తానే గొణుగు కున్నాడు. 'వాకిట్లో చీకట్లో ఎవరో కేక నేనేలే ... నేనేలే . నేనేలే'' అంటూ పలవరించి అర్థోక్తిలో ఆగిపోయాడు. తనలో జరుగుతున్న ఈ ప్రప మథనానికి ఫలితంగా 1933లో 'జయభేరి' వెలువడింది. "నేను సైతం ప్రపంచాగ్ని సమిధనొక్కటి ఆహుతిచ్చాను" —అని శ్రీశ్రీ ఆలపించాడు. ఇది ఆత్మాశ్రయ రీతి వ్రాయబడిన గేయమైనా దీనిలోని వ్యక్తి చైతన్యం సామాజిక చైతన్యంలో భాగస్వా ఇది శ్రీశ్రీ స్వంత గొంతుకను లోకానికి చాటిన ప్రప్రథమ గేయం.

1934 ఏప్రిల్ 12వ తేదీ 'మరోప్రపంచం మరో ప్రపంచం మరోప్రపం పిలిచింది' అనే చరిత్రాత్మక గేయాన్ని సృష్టించాడు శ్రీశ్రీ. ఈ గేయమే అ 'మహాప్రస్థానం' గేయసంపుటికి మకుటాయమానంగా నిలిచిపోయింది. ఇదే రాను తరంలో ఉద్యమంగా వెలువడిన అభ్యుదయ కవిత్వానికి పాదులు వేసింది. 19 వరకు శ్రీశ్రీ రచించిన 'మహాప్రస్థానం సంపుటిలోని గేయాలలో అధికభాగం మార్క్ జాన్ని గర్భీకరించుకున్న రచనలే. ఈ గీతాలు అభ్యుదయ కవిత్వయుగానికి నా ప్రస్తావనలు. భావకవిత్వ యుగానికి భరతవాక్యాలు.

❀